శ్రీ

# మహాభక్త విజయము

(ఐదంకముల నాటకము.)



గ్రంథకర్త:
సోమరాజు రామానుజరావు.



ప్రకాశకులు:
కురుకూరి సుబ్బారావు
సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ.



ముద్రాపకులు:
క. కోదండరామయ్య,
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1932.

 [వెల రు. 1.

శ్రీ

# మహాభక్తవిజయము.



(5 అంకముల నాటకి

గ్రంథకర్త:
స్వరాజ్యరథము, సతీ అనసూయ, భీష్మబ్రహ్మచారి, గంగావతరణము,
రంగూను రౌడి, ధరణికోట, కాలకేతనము, భ[illegible],
ఇత్యాది బహునాటకకర్తలగు దేశముఖు, దేశపాండ్యా

## సోమరాజు రామానుజరావుగారు.



ప్రకాశకుఁడు:
కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

మొదటికూర్పు : 1,000 ప్రతులు.

ముద్రాపకులు:
కర్లపాలెము కోదండరామయ్యగారు,
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1932

 [వెల రు 1-0-0.

# ప్ర జ్ఞా ప న ము.

ఈ మహాభక్తవిజయ మిప్పటికి సుమారు 8 సంవత్సరములకు పూర్వము, "రంగూను శ్రీ ఆంధ్రజాతీయనాటకసభవా" రాడుటకై, తొలుత నాచే రచింపఁబడినది. అప్పు డెనమండ్రు భక్తుల చరిత్రగాఁ బ[illegible]బడినది. రంగూనునగరమునందుఁ దత్సభాధికారు లగు శ్రీయుత [illegible]వేంకటరెడ్డిగారు విశేష ధనవ్యయముతో గొప్ప రంగస్థలపరికరములను చేయించి, ప్రదర్శింపించి, యీ నాటకమునకు వన్నె దెచ్చిరి. కాని ప్రదర్శనము పూర్తియగునప్పటికి, ఉషఃకాలమగుచువచ్చెడిది. కావున నిందు "రామదాసు, కబీరుదాసు, అంబరీష" యను మూఁడుకథలు విడువఁబడినవి. దీనిని నామిత్రులును సరస్వతీ గ్రంథాలయాధికతులును నగు కురుకూరి సుబ్బారావుగారు నావలన సర్వస్వామ్యములతో గ్రహించి, సరస్వతీనాట్యమండలివారిచే విజయవాడయందు 4-10-32 తేదీ మంగళవారమునాఁడు, గొప్ప సీనరీతోడను వైర్ వర్కులతోడను ట్రిక్ స్ఫురుసీనులతోడను, ప్రదర్శింపఁ జేసిరి. నాటకము సుమారు 3 గంటలరాత్రికి పూర్తినందెను. ఆనాఁడు ముఖ్యపాత్రలను ధరించి, సమర్థతతో నటించిన నటకుల నామములను వేఱొకచోట ముద్రించియున్నారము. ఈ నాటకము కొఱకై సీనరీవ్రాసిన, హరోతా సత్యనారాయణగారికిని, విలువగల దుస్తులను సిద్ధపరచిన వేంకటరత్నముగారికిని, మూఁడుదినములలో నాటకమునంతను, సర్వాంగసుందరముగా ముద్రించి నాటకదినమున కందఁజేసిన బెజవాడ గ్రంథాలయ ముద్రాక్షరశాలా ముద్రాపకులగు శ్రీయుత కర్లపాలెము కోదండరామయ్యగారికిని, నా కృతజ్ఞతను జూపుకొనుచున్నాను. ముందుముం దీనాటకము ఆంధ్రనటకుల యభిమానాదరములం జూరఁగొని సర్వత్ర ప్రచారముం గాంచు నని యాసించుచున్నాను.

బెజవాడ,
5—10—32.

ఇట్లు రసజ్ఞవిధేయుఁడు,
సోమరాజు రామానుజరావు.

4—10—32 వ తేదీని, బెజవాడ శ్రీదుర్గాకళామందిరమున, ప్రదర్శింపఁబడిన శ్రీ సరస్వతీ నాట్యమండలి ప్రథమ ప్రదర్శనము.

# నాటి పాత్రధారణ వివరములు.

(1) మాష్టర్ కల్యాణి.
విష్ణువు (గజేంద్రమోక్షము—పరీక్షిత్తు), కృష్ణుఁడు (కుచేల), నారదుఁడు (మార్కండేయ-ధ్రువ).

(2) మాష్టర్ నాగలింగం.
నారదుఁడు (గజేంద్రమోక్షం), శృంగి, శుకుఁడు (పరీక్షిత్తు), మార్కండేయుఁడు(మార్కండేయ),ధ్రువుఁడు (ధ్రువచరిత్ర).

(3) మాష్టర్ సూరిబాబు.
గజేంద్రుఁడు (గజేంద్రమోక్షం), కోలాహలుఁడు (పరీక్షిత్తు) యముఁడు (మార్కండేయ).

(4) మాష్టర్ రామకృష్ణశాస్త్రి.
శమీకుఁడు(పరీక్షిత్తు),కుచేలుఁడు(కుచేల),సురుచి(ధ్రువచరిత్ర).

(5) మాష్టర్ శ్రీరామమూర్తి.
ఇంద్రద్యుమ్నుఁడు (గజేంద్రమోక్షం), పరీక్షిత్తు (పరీక్షిత్తు), జయుఁడు (కుచేల), పీర్ సాహెబ్ (మార్కండేయ) ఉత్తానపాదుఁడు (ధ్రువచరిత్ర).

(6) మాష్టర్ రామారావు.
తక్షకుఁడు (పరీక్షిత్తు), విజయుఁడు (కుచేల), సోమయాజి, శంకరుఁడు (మార్కండేయ)

(7) మాష్టర్ రాధాకృష్ణమూర్తి.
గరుత్మంతుఁడు (గజేంద్రమోక్షము), నారదుఁడు (పరీక్షిత్తు), రుక్మిణి (కుచేల), దీక్షితులు (మార్కండేయ), విష్ణువు (ధ్రువచరిత్ర).

(8) మాష్టర్ పాపారావు.
లక్ష్మీదేవి (గజేంద్రమోక్షము), చైత్రుఁడు, జనమేజయుఁడు (పరీక్షిత్తు), కాళింది (కుచేల), ఉత్తముఁడు (ధ్రువచరిత్ర).

---

# శ్రీ కురుకూరి సుబ్బారాయాభినందనము.



ఉ॥ శ్రీవసుధాత్మజామలవిశేషతనుప్రభ క్రొమ్మెఱుంగుగా;
భావితవైజయంతిరుచి వాసవువిల్లుగ, సత్కృపారసం
బే వరవర్షధారగ, రహించెడు రాఘవనీరదంబు, నా
నావిభవంబు, లాయువు, ధనం బిడి యేలుత సుబ్బరాయనిన్.

చ॥ అగణితవేదమంత్రితతు, లాస్యచతుష్టయనిర్గతంబులై
విగళితదోషుగా సలుప విశ్వజగత్కృతికర్తయైన, యా
నిగమవిభుండు, పూజిత మనింద్యము నైన చిరాయురున్నతిన్
సుగుణగణంబులిచ్చి, వసుశోభితు నేలుత సుబ్బరాయనిన్.

ఉ॥ సారసపీఠసంయుత, నిశాపతికిన్ సహజాత, యానిరా
కారునిఁ గన్నమాత, కనకంబు లిడన్ నెరదాత, సారగం
భీరపయోధిజాత, శుభవీక్షణముం బ్రసరింపఁ జేసి, సం
చారము సేయుగావుత! యజస్రము సుబ్బయ శ్రేష్ఠివాఁకిటన్.

కంద, గీత గర్భిత చంపకమాల.

చ॥ వరకురుకూరిసత్కులము భాసురమాగతి గోధనాది సుం
దరగృహముల్ మహాయశము ధర్మము తా ననయంబుగాంచు, శ్రీ
ధరమరుదారుధీసులభ వాగురసద్గుణ సుబ్బరావుకున్,
చిరశుభమా, ధరన్ సతము శ్రీవిభుఁడోము పవిత్రశక్తిచేన్.

క॥ కురుకూరిసత్కులము భా
సురమాగతి గోధనాది సుందరగృహముల్
అరుదారుధీసులభ వా
గురసద్గుణ సుబ్బరావుకున్ చిరశుభమా.

గీ॥ కులము భాసురమాగతి, గోధనాది
యశము ధర్మము తా ననయంబుఁగాంచు
సులభవాగురసద్గుణ సుబ్బరావు!
సతము శ్రీవిభుఁడోము పవిత్రశక్తి.

మత్తేభ, కంద గర్భిత సీసము.

సీ॥ వినయసమ్మోదకవిత్వగర్భితకళా
నందాత్మ సచ్చింతనా సుశీల!
విజయసంతోషవివేకమానస, సర
స్వద్గ్రంథశాలాధిపాలనాఢ్య
విజయవాడస్థిత! భీమడోలునగరీ
సంజాత వైశ్యాత్మజా! దయాళు!
విభయదాకారనవీననాగరకతా
పాపఘ్న సౌందర్యభాసురాంగ!
విమలగుణసోమయాత్మజ! వినుతవిజయ
గ్రంథ గుణవివేకహృదయ రాట్సుమసుఖ!
శుభము లెపుడు నీకమరెడు సుబ్బరాయ!
స్వాయంభువుని కృపచే సర్వసాక్షి గాగ!

మ॥ నయసమ్మోదకవిత్వగర్భితకళానందాత్మసచ్చింతనా
జయసంతోషవివేకమానస సరస్వద్గ్రంథశాలాధిపా
జయవాడస్థిత! భీమడోలు నగరీసంజాత! వైశ్యాత్మజా!
భయదాకారనవీననాగరకతాపాపఘ్న! సౌందర్యభా!

కం॥ విమలగుణ! సోమయాత్మజ!
వినుతవిజయ! గ్రంథగుణవివేకహృదయ! రా
ట్సుమసుఖ! శుభము లెపుడు నీ
కమరెడు సుబ్బరాయ! స్వాయంభువునికృపచే.

ఇట్లు,
భవదభ్యుదయాభిలాషి,
గ్రంథకర్త.

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | 1 | చుచున్నవి! | చుచున్నది! |
| 18 | 5 | పరీక్షిన్మ | పరీక్షిన్న |
| 25 | 5 | భస్మపటలము | భస్మీపటలము |
| 32 | 13 | పాపోప సంహారముఁ | శాపోప సంహారముఁ |
| 33 | 22 | నరుగ | నురగ |
| 34 | 15 | పండనిండు | పంపనిండు |
| 41 | 18 | సర్వయోగంబులను | యోగంబులను |
| 41 | 25 | కరగెదను; | కరిగెదను; |
| 49 | 12 | మే మిగుపురను | మే మిగపురమును |
| 55 | 6 | (2 పిడికిళ్లు తినెను) | (2 పిడికిళ్లు తినును) |
| 59 | 8 | మకీ, | మాకీ, |
| 59 | 9 | మదీదిల్ మే - | మాదీదిల్ మే - |
| 59 | 10 | మాకీ కఫరీస్తాఞ | మాకీ ఫరీస్తాఞ |
| 60 | 13 | ఇంతపుణ్యం మేము కమాయించి [నాము; | ఇంతపుణ్యము మేం కమాయించి [నాము; |
| 60 | 20 | ఘోష్ ఖానా | గోష్ఠ్ ఖానా |
| 61 | 13 | మిగతవన్ని | మిగతవన్నీ |
| 65 | 16 | సరసరమైన | సరసమైన |
| 66 | 18 | రంభాహూనా | రంభ హోనా |
| 68 | 22 | నదిగా | ననిగదా |
| 70 | 22 | సాధుహింసపరాయణా! | సాధుహింసాపరాయణా! |
| 76 | 17 | నార—ఈడంబులకేమిలే! | నార—ఈడంబములకేమిలే! |
| 77 | 20 | బాస్వంతాయ! | ఛాస్వంతాయ! |
| 79 | 5 | ప్రశస్తమై | ప్రశస్తమా |
| 94 | 8 | (అనుబంధము 41) | (అనుబంధము 46) |

☞ ప్రతిపత్రమునకును, పైభాగమునంగల గ్రంథనామపు పంక్తిని వదలి పైనుండి, పంక్తులను లెక్కించుచు, తప్పొప్పులను కనుగొనవలెను. 59 వ పుటయగు చతుర్థాంక ప్రారంభపత్రమున - పైనుండి గ్రంథనామము మున్నగు పంక్తులన్నిటిని లెక్కించి తప్పొప్పులను కనుగొనవలెను. పాఠకులు తొలుత, శుద్ధపత్రము ననుసరించి గ్రంథముద్రణ దోషములను సవరించుకొనిన పిదప గ్రంథపఠన మాచరింపనగును.

గ్రంథకర్త.

శ్రీ

మహాభక్తవిజయము.

ప్రథమాంకము.



# గజేంద్రమోక్షము.



# ఇందలి పాత్రలు.

## —♦ పురుషులు ♦—

1. ఇంద్రద్యుమ్నుఁడు
2. నీతిసాగరుఁడు
3. కొందఱుపరిజనులు
4. శ్రీమహావిష్ణువు
5. నారదుఁడు
6. గరుత్మంతుఁడు
7. హూహూనామగంధర్వుఁడు
8. గజేంద్రుఁడు
9. కొందఱు దేవతలు.

## —♦ స్త్రీలు ♦—

1. లక్ష్మీదేవి
2. కొందఱు దేవతాంగనలు.





# శ్రీ మహాభక్త విజయము.

## ప్రథమాంకము.

## గజేంద్రమోక్షము.

రంగము 1 — త్రికూటాచలమునందలి అరణ్యమున,
ఇంద్రద్యుమ్నుని శిబిరములు.

[ప్రవేశము: ఇంద్రద్యుమ్నుఁడు, నీతిసాగరుఁడు, కొందఱుపరిజనులు.]

అందఱు—(అనుబంధము 1.)

నీతి—ఇంద్రద్యుమ్నమహారాజా! నామనవి యొకటి కలదు.

ఇంద్ర—వినఁ గుతూహలినై యున్నాను.

నీతి—మనము మృగయాక్రీడకై, ఈప్రాంతములకు వచ్చి రెండు నెలలు మీఱినది.

ఇంద్ర—ఔను. అది నిజమే!

నీతి—రాజధానికిఁ గావలసిన రాజ్యాంగవ్యవహారము లత్యవసరములై యున్నవి.

ఇంద్ర—దీనినిసయితము గ్రహించియే యున్నాను.

నీతి—తల్లిగారు, తమకు దుస్స్వప్నము వచ్చిన దనియును, వెంటనే గృహాభిముఖులు కావలయుననియు నిన్ననే వార్త నంపిరి.

ఇంద్ర—ఇది మన కవశ్యముగా శిరోధార్యము.

నీతి—మహారాజా! ప్రభువులకు, మాబోంట్లాదేశింపఁదగువారే కాని, ఆజ్ఞాపింపఁదగువారు కారు. ఐనను ప్రభువులకు మంత్రి రక్షణము పరమకర్తవ్యము కావున, సాహసమైన విన్నవించుకొను నన్ను మన్నింపవలయును.

సీ॥ మంత్రాంగమే రాజ్యతంత్రంబులకు నెల్ల
ధారుణి జీవనాధారమగుట
మృగయావినోదంబు నృపుల కవశ్యంబు
వదలఁగాఁ దగిన దుర్వ్యసన మగుట
విభుఁడు రాష్ట్రంబును విడిచి చరించుట
రిపులకు ననుకూల రీతి యగుట
తగ దేశకాలపాత్రముల నెన్నకయుంట
నీతిభూరుహ పాత హేతువగుట
మనవి చేయుచుంటి మనుజేంద్ర! వ్యసనంబు
లందుఁ దగులువడిన యాత్మబుద్ధి
మఱలఁజేసి, యింక మనరాజ్యసీమలఁ
జేరవలయు; మనవి చిత్తగించి.

ఇంద్ర—సచివచంద్రమా! నీవాక్యములు రాజ్యతంత్రజ్ఞుల కత్యంత ప్రమాణములు. నేనుసయితము అట్లే యోజించితిని. ఈ ప్రాంతంబుల నున్న భిల్లులు, తమకు మృగబాధానివృత్తిఁ గావింపుఁడని నిన్నఁగదా వేడుకొని చనిరి ఆరవంత కార్యమైన పిదప నెల్లుండి మనము గృహోన్ముఖుల మగుదము.

నీతి—నాకర్తవ్యమును నే నొనరించితిని. మీాద తమచిత్తము.

ఇంద్ర—రెండుమూఁడు దినములలో చెడిపోవు కార్యములు మాత్ర మేమి యుండును?

నీతి—మఱచితిరి; దేవా! పూర్వ మొకనాఁడు, తమరు భగవద్ధ్యాన తత్పరులై యున్నప్పుడు పరమకోపస్వభావుఁ డగు దూర్వాస మహర్షి తమకడ కరుదెంచి, తమచిత్తము భగవదాయత్తం బగుట నెఱుంగక, "త్రికూటమునఁ బరిజనులతో నొకగజేం

దు్రఁడవై జన్మింతువు గాక" యని శపించెను. మన మిప్పుడు త్రికూటపర్వతప్రాంతంబులకు వచ్చితిమి; కావున నన్ముని శాపఫలం బిప్పుడు జఱుగనున్నదని నాకుఁ దోఁచుచున్నయది!

ఇంద్ర—అప్పు డా ముని మరల శాపమోక్షము ననుగ్రహింపలేదా?

నీతి— అనుగ్రహించినాఁడు!

ఇంద్ర—ఏమని?

నీతి—అట్లు తమరు గజేంద్రులై యున్నకాలమున శ్రీమన్నారాయణుని యనుగ్రహంబున మోక్షము గల్గు నని చెప్పెను.

ఇంద్ర—నీతిసాగరా! అట్లయిన నీశాపము నాకు వరప్రసాదమేసుమీ! ఏ మంటివేని?

ఉ॥ ధారుణిఁ బుట్టి పుట్టి వితథంబగు మృత్యుశతంబు నంది భూ
భారము మెచ్చుకంటె హరిపాదరజోఫలలాభయుక్తి నిం
పారగ ధారుణిన్ విడిచి స్వర్గముఁ జేరఁగ మార్గమబ్బె; నీ
దారుణశాప మింక వరదానముగా గ్రహియింతు ధీమణీ!

(తెరలో)

త్రికూటపర్వతపరిసరములయందలి భిల్లులు మృగయాక్రీడకై సర్వసన్నాహములతో నరుదెంచి తనుయానతి కెదురు చూచుచున్నారు!

ఇంద్ర—ఇదె వచ్చితి నని చెప్పుము!—పరిజనులారా! వేఁటకరుగుద ము లెండు!

అందఱు— (అనుబంధము 1) [పటపరివర్తనము]



రంగము 2 — ఆకాశమార్గము.

[ప్రవేశము : ఆకాశమార్గమునుండి గరుత్మంతుఁడును
భూలోకమునుండి నారదుఁడును.]

ఇద్దఱు—(అనుబంధము 2.)

గరు—ఓహో! నారదా! ఎక్కడనుండి వచ్చుచున్నావు?

నార—ఓహో! గరుత్మంతా! నీ వెక్కడనుండి వచ్చుచున్నావు?

గరు—నేను గంధర్వలోకమునుండి వచ్చుచున్నాను.

నార—నేను భూలోకమునుండి వచ్చుచున్నాను.

గరు—అచ్చటి విశేషము లేమి?

నార—ఇంద్రద్యుమ్నుఁ డనురాజు, దూర్వాసశాపమువలన, త్రికూటపర్వతమునకు వేటకై చనినంత, తనపరిజనులతోఁగూడ విచిత్రముగ గజేంద్రముగ మారిపోయెను. ఇప్పుడే నే నాచిత్రమునుజూచి వచ్చుచున్నాఁడను.

గరు—ఓహో! ఈ దూర్వాసశాపము పదునాల్గు జగంబులను వదలకున్నదే!

నార—ఏమి జరిగినది?

గరు—గంధర్వలోకమున హూహూఁ నాముఁ డను పేరుగల గంధర్వరాజు గలఁడని నీ వెఱుంగుదువుగదా!

నార—ఆఁ ఎఱుఁగుదును. దూర్వాసుఁ డాతని శపించెనా యేమి?

గరు—వినుము; ఆగంధర్వుఁడు, తనభార్యలతో విలాసముగ మధుసేవ చేయుచున్నతరి దూర్వాసుఁ డటకరిగెను. అప్పు డాతఁడు, మధుపానమత్తత నమ్మునిని నిరాదరణ సలిపెను. తోడనే దూర్వాసుఁడు మండిపడి, త్రికూటపర్వతసమీపమునన్న కాసారమున నొకమకరమవై జనింపు మని శపించెను.

నార—మును లాగ్రహమున శపించుటయు, తిరిగి శాపమోక్షము సయితము, తప్పులు చేసి బిడ్డకొను నయ్యావార్లవలె, తామే యనుగ్రహించుటయు నాచారము లేకద! అట్లు జరిగెనా?

గరు—ఏల జరుగకుండును? గంధర్వుడప్పుడు ప్రార్థింప శ్రీమన్నారాయణునియనుగ్రహమున మోక్షము గల్గునని చెప్పెను.

నార—గరుత్మంతా! గజేంద్రగంధర్వులకథలకేమైన సంబంధముకలదా యేమి? దూర్వాసుఁ డిద్దఱికొక్కచోటనే శాపము నొసంగి, మోక్షమును ఒకేవిధమున ననుగ్రహించినాఁడు!

గరు—తోఁడలు యేల? కొలఁదికాలమున కదియే తెలియఁగలదు!

నార—అట్లయిన నీ విప్పు డెందుఁబోవుచున్నాఁడవు?

గరు—వైకుంఠమునకు!

నార—నేనును వచ్చుచున్నాను పద!

ఇద్దఱు—(అనుబంధము 3.)

(ఇరువురు నిష్క్రమింతురు)

[పటపరివర్తనము.]

రంగము 3. — వైకుంఠము.

[ప్రవేశము : నాభీకమలస్థితచతుర్ముఖసహితుఁడగు మహావిష్ణువు శేషశాయియై లక్ష్మీదేవితో చతురంగ మాడుచుండగా రెండుదెసలఁ గల పద్మములలో నుపవిష్టులై నారద గరుత్మంతులు చూచుచుందురు]

(అనుబంధము 4)

లక్ష్మి—తోఁసిరాజు చేసి నన్ను గెలుతు నని యెంతసేపటినుండియో బెదరించు చుంటిరే! ఇదే చూడుఁడు — నాశకటమును జరిపితిని. మీరాజును కాపాడుకొనుఁడు!

విష్ణు—నారాజును — నల్లగడినుండి తెల్లగడికి నడిపితిని.

లక్ష్మి—ఈసారి తెల్లశకటముతో రాజు —

నార—నేను మాయమ్మపక్షము; గరుత్మంతా! చూచితివా మా విజయమును?

గరు—నేను మాయయ్యపక్షము. రాజును మాయయ్య ఎట్లు కాచుకొనునో చూచుచుండుము.

నార—రాజు కీచు కీచు మనుచున్నాఁడు! ఇం కెక్కడితప్పుకొనుట! ఇటువచ్చినచో నల్లశకటము! అటుపోయిన తెల్లశకటము. ఇంకొకగడి లేదుకదా!

విష్ణు—నీ తెల్లశకటమునకు బంటు నడ్డము త్రోసితిని! అడ్డము త్రోయఁబడిన బంటు శకటముపై పగ. నాబంటుకు గుఱ్ఱము కాఁపు.

గరు—నారదా! చూడు చూడు, శకటము చచ్చెఁ; జచ్చె.

లక్ష్మి—శకటమును వెనుకకు నడిపితిని! అందుచే మీ యేనుఁగునకు పగయైనది! ఇఁక, నేనుఁగుకు దారిలేదు. అడ్డుపడుట కాధారము లేదు.

(తెరలో) హా! దీనబంధూ! కృపాసముద్రా! పాహి మాం పాహి మాం.

(అనుబంధము 5)

విష్ణు—(విభ్రాంతుఁడై పరధ్యానముగ వినుచుండును.)

లక్ష్మి—(వీపుపైఁదట్టి) ఏమి మాటాడవు? ఏనుఁగు విపత్తునందున్నది. రక్షించుకొనుఁడు!

విష్ణు—ఊం డుండు! ఏనుఁగు విపత్తునం దున్నదియా? నిజమే! నాకును నట్లే వినఁబడుచున్నది!

లక్ష్మి—వినఁబడుటయేమి? కనఁబడుట లేదా? మీగజేంద్రుఁడు ప్రాణావశిష్టుఁడై యున్నాఁడు.

(అనుబంధము 5.)

విష్ణు—గజేంద్రా! భీతిల్లకు! భీతిల్లకు! నే నిదే వచ్చితిని!

నార—హా హా హా! గజేంద్రరక్షణమున కర్తవ్యము నెఱుంగక ప్రభువారికి భ్రాంతి గల్గినది!

గరు—నారదా! ప్రభువుతో పరిహాస మేల? స్వామిని నా ఱెక్కలపై నిడుకొని ఎగిరిపోయి గజేంద్రరక్షణము చేయింపలే ననుకొంటివా?

నార—అంతవరకు సావకాశ మేది?

విష్ణు—ప్రాణాపన్నుండవగు నో గజేంద్రా! మేము నీ రక్షణమునం దుపేక్ష చేసితిమి! దుఃఖింపకుము. ఇఁక భీతి లేదు.

గీ॥ మహితధర్మపాలన, మధర్మక్షయంబు
నెరప, యుగయుగమునకు జన్మింతు నేను;
కలదు భక్తావనమున కంకణము మాకు;
• చింతిలకుమయ్య! నిన్ను రక్షింతు నేను.

లక్ష్మి—అయ్యో! ఇది యేమి పరిహాసము? చతురంగపుజంతువులతో సంభాషించుచున్నారు. ఇటు చూడుఁడు! ఇక్కడనే గజేంద్రమున్నది?

ఇదిగో! మీ గజేంద్రుఁడు! చతురంగపుబల్లమీఁద నున్నాఁడు! శకటముచే భీతిల్లుచున్నాఁడు.

విష్ణు—ఛీ! శకట మనియెద వేల? మకరము.

లక్ష్మి—మకరమా? మకరమా? ఏమి యీవింతమాటలు! చతురంగమున మకరము లుండునా?

(తెరలో) [అనుబంధము 5.]

విష్ణు—(లక్ష్మి చీరచెరఁగు పట్టుకొనియే లేచి) ఓ గజేంద్రా! భక్తశిఖామణీ! భీతి నందవలదు; భీతి నందవలదు. నేను భక్తుల యార్తాలాపముల నాలకించి, సహింపఁజాలను. మందమతినై ఇంతదనుక నిన్ను దుఃఖపెట్టితిని. ఆహాహా! నీ వెంతకృశించిపోయితివి? తనయా! నీ కన్నుల నీరెట్లు కాలువలై ప్రవహిం

చుచున్నవి! పాపిమకరము నీపాదముంబట్టి స్థానబలముచే బాధింప దిక్కు లేక, దీనత నంది, కుంది, దిక్కులు చూచి చూచి, యాతురమున, నెంత కాతరఁ జెందితివో! నీదుఃఖముం జూచినకొలఁదియు నాగర్భము విదారితమై పోవుచున్నది. భక్తశిఖామణీ! నాహూరిమితనయా! నీకు వచ్చిన మహా విపత్తును నేను నివారింతును! నిన్ను నాసమక్షమునఁ జేర్చు కొందును. ఆక్రందింపకుము! ఆక్రందింపకుము.

గీ॥ ధాత్రియంతయు నాదుసంతాన మయ్య;
అందు భక్తులు నాయాప్తు లనఁగుసుతులు;
వారి యాపదఁ గాంచి యోర్వంగఁజాల
వేఁగ నినుఁ గానవచ్చెద నోగజేంద్ర!

లక్ష్మి—నాథా! నాచేలాంచలమును వదలుఁడు.

విష్ణు—(అనుబంధము 6)

(లక్ష్మితో - వేగముగ నిష్క్రమించును.)

నార—గరుత్మంతా! జగన్నాథుఁ డిది యేమి యిట్లు చేయుచున్నాఁడు?

మ॥ తను వేంచేయుపదంబుఁ బేర్కొనఁ, డనాథస్త్రీజనాలాపముల్
వినెనో, ముచ్చులు ముచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్,
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో, భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్?

(తరువాత - లక్ష్మీదేవిచెలులు ప్రవేశింతురు)

చెలి 1—సఖి! ఇది యేమే? లక్ష్మీనారాయణు లెందో పరువిడు చున్నారు!

చెలి 2—ఈ నారద గరుత్మంతుల నడిగినం దెలియునేమో!

చెలి 3—నారదా! ఈ యుపద్రవ మేమి?

నార—మాకుమాత్ర మేమి తెలియును? లక్ష్మీనారాయణులు చతురంగ మాడుచుండిరి! మేము చూచుచుంటిమి. ఇంతలో నెచ్చటనుండియో యొకయార్తనాదము శ్రవణతాడితమయ్యెను.

అది విని, స్వామివారు 'గజేంద్రా! భీతిల్లకు' మని పలుకుచుఁ
బరుగెత్తిరి! ఆత తరము నేమని వర్ణింతును ?

మ॥ సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం బన్నింపఁ, డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు, వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు, గజప్రాణావనోత్సాహియై.

చెలి—అట్లయిన ఆ చిత్రమేమో మనమును జూడఁబోవుదము.
(అనుబంధము 7.) [నిష్క్రమింతురు]

గరు—నారదా! శ్రీనాథుఁడు వాహనంబైనను లేక చనుచున్నాఁడు.
నేను వెంటఁ బరుగెత్తుదును. [నిష్క్రమించును]

(కొందరు దేవతలు ప్రవేశింతురు)

1. దే—నారదా! స్వామివా రెం దరుగుచున్నారు?

నార—నాకును విస్మయముగానున్నది! 'గజేంద్రా! భీతిల్లకు' మనిపలికి
పరుగెత్తుటం జూచితిని.

1. దే—బృందారకులారా! మఱల నేదైన దేవాసురయుద్ధము ప్రాప్తిం
చెనో యేమిగతియో? శ్రీనాథుఁడు శంఖచక్రములుగూడ
వెంటఁగొని చనఁడయ్యె! శంఖచక్రములంగొని మనము
వెంబడింతము రండు. (అనుబంధము 7.) (నిష్క్రమింతురు.)

నార—ఏమిచిత్రమిది! ఈగజేంద్ర మొకవేళ నాటియింద్రద్యుమ్నుఁడు
కాఁడుగద! అతని కొకవేళ మోక్షకాలము వచ్చెనేమో!

మ॥ తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, వానివె
న్కను బక్షీంద్రుఁడు, వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును, వానివెంట ధ్వజినీకాంతుండు రా, వచ్చి రో
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

నేనును చనియెదను. (అనుబంధము 8.) (నిష్క్రమించును)

[పటపరివర్తనము.]

## రంగము 4 — త్రికూటాచలమునందలి సరోవరము.

[ప్రవేశము:— మకరముచే బాధపడు గజేంద్రుఁడు]

గజేం—(అనుబంధము 5).

శా॥ లావొక్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యెఁ; బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను; మూర్ఛవచ్చెఁ; దనువున్ డస్సెన్; శ్రమంబయ్యెడిన్;
నీవే తప్ప యితఃపరం బెఱుఁగ; మన్నింపం దగుం దీనునిన్;
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

క॥ కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగిగణములపాలన్,
కలఁ డందు రన్నిదిశలను,
కలఁడు కలం డనెడువాఁడు కలఁడో లేఁడో!

(ఆకాశమున గరుడవాహనారూఢుఁడగు విష్ణువు కనఁబడును)

విష్ణు—భక్తశేఖరుండవగు నో గజేంద్రా! దుఃఖింపకుము! మకరము నిదే వధించి నీకు మోక్షము నిచ్చుచున్నాఁడను.

(చక్రమున మకరమును వధింపఁగా మకరము గంధర్వుఁ డగును)

గంధ—వైకుంఠవాసా! నారాయణా! దూర్వాసమునిదత్తం బగు నా శాపంబు, నీకృపారసపాతంబునఁ దొలంగెను. నాకు మోక్ష సామ్రాజ్యముం బ్రసాదింపుము!

విష్ణు—గంధర్వోత్తమా! నీతో పాటుగా మత్ప్రియభక్తశేఖరుఁడగు నీగజేంద్రునకును మోక్షమును బ్రసాదించితిని. నేఁటినుండియు నీగజేంద్రమోక్షచరిత్రము లోకవిఖ్యాతి నంది తత్పాఠకలోకపాపహరం బగునుగాక!—

అందఱు—[అనుబంధము 9] [పటపరివర్తనము.]

గజేంద్రమోక్షము సంపూర్ణము.

శ్రీ

# మహాభక్తవిజయము.

ద్వితీయాంకము.



# పరీక్షిత్తు.



# ఇందలి పాత్రలు.



## పురుషులు

1. పరీక్షిన్మహారాజు
2. శమీకమహర్షి
3. శృంగి
4. చైత్రుఁడు
5. కార్తికుఁడు
6. మంత్రి
7. సేవకుఁడు
8. తక్షకుఁడు
9. కోలాహలుఁడు (కాశ్యపుఁడు)
10. నారదుఁడు
11. శుకుఁడు
12. వ్యాసుఁడు
13. శ్రీమహావిష్ణువు
14. ఇంద్రుఁడు
15. జనమేజయుఁడు.





# శ్రీమహాభక్తవిజయము.

—— ద్వితీయాంకము ——

## పరీక్షిత్తు.

### రంగము 1. — శమీకమున్యాశ్రమము.

[ప్రవేశము : శమీకమహర్షి తపస్సునందుండఁగా పరీక్షిన్మహారాజు.]

పరీ—(స్వగతము) (అనుబంధము 10) అకటా! వేటతమకంబున మిగుల నలసి, దాహపీడితుఁడ నైతిని. ఇది శమీకమహర్షి యాశ్రమమువలె నున్నది.—ఏమి నాయదృష్టము! శమీకమహర్షి సమీపమునందే యున్నవాఁడు. ఇతఁడు నాకు దాహశాంతిఁ గలుగఁజేయఁగలఁడు. (ప్రకాశముగ) మునీంద్రా! నమస్కారము.

శమీ—(పలుకక, తపమునం దుండును.)

పరీ—ఏమీ యీముని గర్వము? ఈ రాష్ట్రమున కెల్ల నధిపతినగు నేను వచ్చి యెదుట నిలిచినను, గన్నులఁ జూడక, నిద్రాగరిష్ఠుండైన పోలిక, ముక్కుమూసికొని జపము సేయుచున్నాఁడే!

ఉ॥ కన్నులమూసి బ్రాహ్మణుఁడు గర్వముతోఁ దుతనున్నవాఁడు; చే
సన్నలనైన రమ్మనఁడు; సారజలంబునుఁ దెచ్చి పోయఁడే
మన్ననలైన సేయఁడు; సమగ్రఫలంబులు పెట్టఁడింత సం
పన్నతనొందెనే! తన తపశ్చరణాప్రతిమప్రభావముల్?

నా కీతనిం బ్రార్థించునంత దైన్యమేల? దాహవశంబునఁ బ్రాణత్యాగము చేయుదునా? ఈ కమండలువున జలముగల

దేమో! (చూచి) ఛీ! ఛీ!! ఇదియు పట్టికమండలువే. ఈ గర్వమతి యగుమునికి పరాభవము చేసినగాని నా కూరట కలుగదు. (అటునిటు చూచి) ఇచ్చట నొక మృతసర్పము కలదు. దీని నీ శమీకునికంఠమునకు జుట్టిపోయెదఁగాక! (అట్లు చేసి) హా హ్హా హ్హా హ్హా!! మంచిపరాభవమును గల్గించితిని. కాని, దాహశాంతి కాలేదు. ఈ పరిసరమునం దెద్దియేని సరోవరము గలదేమో చూచెదను. (నిష్క్రమణము.)

[శృంగి ప్రవేశము.]

శృంగి—(అనుబంధము 11.) మానవులకు మాతాపితలకన్న పర దైవతంబులు వేరుగాఁగలుగరుగదా! పూజ్యుండగుమజ్జనకులు, శమీకమునీంద్రులు, తపోనిష్ఠయం దున్నవారు. వారి కగ్ని హోత్రాదికంబులు సమకూర్చెదఁగాక! (సమీపించి) అబ్బా! ఇదియేమి? ఈ భయంకరసర్పము! తండ్రిగారి కంఠముం బట్టుకొని యున్నది. మిత్రులారా! రండు; రండు; నాతండ్రి నొకపెనుబాము కఱచుచున్నది.

(చైత్రి - కార్తికులు ప్రవేశము.)

చైత్రు—మిత్రమా! శృంగీ! ఏమి భీతిల్లి యిట్లు కేకలు వేయుచున్నావు?

కార్తి—మునిపుత్రా! ఏమిజరిగినది? ఏమిజరిగినది?

శృంగి—మిత్రులారా! ఇటు చూడుఁడు. నాతండ్రికంఠము నెంత పెద్ద పాము పట్టియున్నదియో! ఈ భయంకరదృశ్యమునకు నా యొడలు కంపించుచున్నది! తండ్రిగారి నిది కఱచి చంపునే మో కదా!

(అనుబంధము 12.)

చైత్రి—కార్తికా! ఇది యేమిరా యీ దారుణము! ఇప్పుడు మన మేమి చేయుదము?

కార్తి—చైత్రా! ఈసర్పము కదలుట లేదేమిరా? ఒకవేళ చచ్చి నది యేమో?

చైత్రి— చచ్చినది నడచి వచ్చి యీయనకంఠమున కెగ్గి వచ్చి చుట్టుకొనునురా? కాక ఈయన దానిని దెచ్చి తానే చుట్టుకొనె నందువా?

కార్తి—ఏమోనబ్బా! ఎవ్వరైన చుట్టిపోయిరేమో!

చైత్రి—కాదు; కాదు. సరిగా చూడరా!

కార్తి—నీవే చూడరా! దగ్గఱికేగుటకు నాకు భీతి గల్గుచున్నది.

చైత్రి—ఇద్దఱమును పోయి చూతము రమ్ము.

(ఇరువురును పోయి పరీక్షించి చూతురు.)

కార్తి—అయ్యయ్యో! ఇది చచ్చినపాముర చైత్రీ!

చైత్రి—గురువర్యులకు మైల సోకినది. దానిని తీసివేయుదము.

కార్తి—నీవును రమ్ము. (ఇద్దఱును కఱ్ఱతో పామును తీసివేయుదురు.)

శృంగి—మిత్రులారా! ఏమి యీదుష్కార్యము! పవిత్రమగు మజ్జనకాంసభాగంబునకీ మృతసర్ప మెట్లు వచ్చియుండునో మీ రూహింపఁగలరా?

కార్తి—ఎవ్వరో దుష్టులు వేయకుండిన నెట్లు రాఁగలదు?

శృంగి—ఏమేమీ! మునివంశపవిత్రుండగు నాజనకునకా యీ పరీభావము! ఎవ్వఁడిట్టి యకార్యకరణం బొనరించి భయంకరమగు నాశాపానలంబున భస్మీభూతుండు కాఁదలంచినవాఁడు? ఏయధముఁడు, మునికోపప్రభావంబు ననుభవింపఁ గోరినవాఁడు? ఏ చండాలుఁడు బ్రాహ్మణక్రోధమహామారుతంబున నెగసిపోనెంచినవాఁడు? ఓ చైత్రి కార్తికులారా! ఇటు వినుఁడు!

ఉ॥ ఓడక వింటికోపున, మృతోరగముం గొని తెచ్చి మాయుమా
టాడకయున్న మజ్జనకునంసతలంబునఁ బెట్టి దుర్మద
క్రీడఁ జరించువాఁడు హరకేశవు లొడ్డిననైనఁ జచ్చుఁ బో
యేఁడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్.

(జలంబులు వార్చును.)

శమీ—(లేచి) నాయనా! శృంగీ! ఏమి యాగ్రహించుచుంటివి?

శృంగి—తండ్రీ! ఎవఁడో దుష్టుఁడు తమకంఠప్రదేశమున మృతసర్పముం జుట్టి చనియె. అది గాంచి సహింపనోపక "నాదుష్టుండు తక్షకవిషానలంబున మరణించుఁగాక!" యని శపించితిని. ఇదియే తచ్ఛవసర్పము!

శమీ—ఎవ్వఁ డీ దుష్కృత్యము నాచరించియుండును? దివ్యదృష్టిం బరికించెదఁగాక! (చూచి) శివ! శివా! ఎంతఘోరము సంభవించెను?

శృంగి—జనకా! అతఁ డెవ్వఁడు?

శమీ—నాయనా! ఏమని చెప్పుదును? భారతబాలవీరశిఖామణి యగు నభిమన్యునికుమారుని, పరీక్షిన్నరేంద్రుని నీవు శపించితివి!

ఆ॥ తల్లికడుపులోన దగ్ధుఁడై క్రమ్మఱఁ
గమలనాభుకరుణఁ గలిగినాఁడు;
భక్తిగలిగి ప్రజలఁ బాలించుచున్నాఁడు
గిట్టుమనుచు రాజుఁ దిట్టఁదగునె?

శృంగి—జనకా! అట్టిసద్గుణశాలి కీ దురాచరణము చెల్లునా? అందుల కాతఁ డీ శాపఫలము ననుభవింపఁ జెల్లదా?

శమీ—తనయా! ఒక్కొకప్పు డిట్టిప్రమాదము లెట్టివారికైనఁ గల్గుట సహజము! అందు పిపాసాపీడితుఁడై బాధనొందుచు, మృగయాక్రీడాభిరతిశ్రాంతుఁడైన పరీక్షిత్తునకు యుక్తాయుక్తపరిజ్ఞానము నశించిన దనిన నాశ్చర్యమేమి? అదిగాక, భూపాలకుల దోషంబులను బ్రాహ్మణులు సహింపకున్న వా రొక్కనిమున మాఁగఁగలరా? నాయనా! ఏది యెట్లున్నను, బ్రాహ్మణుల మగుమన కాగ్రహము తగునా? అట్టిచో మనతపశ్శక్తి నిలువఁగలదా? బడబానలమును గర్భమున ధరించిన సముద్రునివలె బ్రాహ్మణుఁడు తనతపశ్శక్తి నంతర్గతమున నుంచుకొనవలయునేగాని

ప్రజ్వలింపఁజేసిన నీకేమియున్నది! కటకటా! ఇట్టిధర్మపాలకుఁడగురాజు నశియించినపిదప దేశమున కెట్టిపాటు గలుగునో యూహింపక బాల్యచాపల్యమున నెంతపనిచేసితివి! ప్రజాక్షోభమును చేతులారఁ దెచ్చిపెట్టితివిగదా! తనయా!

సీ॥ ఆర్తులై మొఱవెట్టు ననదలపై నగ్ని
వర్షంబుఁ గురిపించు పాపరతులు;
బడుగుల కుపయోగపడు బిడాదికవస్తు
వితతిపై సుంకముల్ వేయువారు;
ఏమాటఁ బల్కిన నిది రాజవిద్రోహ
మంచు, సజ్జనుల బాధించువారు;
ప్రజలనోటను దుమ్ముఁ బడఁగొట్టి కడునిరం
కుశపాలనముసేయు కుటిలమతులు;
గలుగురాష్ట్రంబునను గల్గు కష్టచయము
లరసి, వానినిఁ బోఁద్రోలి యనులబుద్ధి
యగుచు ప్రజలనుఁ బాలించునట్టిరాజు
గలుగు టెంతటి భాగ్యమో తలఁపవలదె?

అదిగాక తనయా! పరీక్షిన్నరేంద్రుం డనిన నీవేమిగా భావించి యిట్టిదారుణశాపంబు నొసంగితివోకదా?

గీ॥ ధర్మదేవత, మూఁడుపాదములు విఱుగఁ
దన్నినట్టియాకలిని, వింతగ నెదిర్చి
నాల్గుపాదముల్ ధర్మంబు నడిపినట్టి
శీలవంతుఁడు సుమి పరీక్షిద్విభుండు.

శృంగి—తండ్రీ! అతండని యెఱుంగక శపించితిని. నన్ను మన్నింపుము.

శమీ—నిన్ను మన్నించిగాని, మన్నింపకగాని చేయునది యిప్పుడేమియును లేదు; కటకటా! ఎంతటిపుణ్యాత్మున కెంతటిద్రోహము జరిఁగెను.

శృంగి—తండ్రీ! ఈ యపరాధమును దురితమతి నయి కావించితిని. నా కిందుల కెద్దియేని నిష్కృతి ననుగ్రహింపుము.

శమీ—"బుద్ధిః కర్మానుసారిణి"—ఇది యిటుల జఱుగుట దైవచోదితము కాఁబోలును! ఎవ రేమి చేయుదురు? చైత్ర కార్తికులారా! మీరు రయంబునఁ జని, జరిగిన వృత్తాంతమును, పరీక్షిన్మ రేంద్రున కెఱిఁగించి నాపలుకులుగా నిట్లు చెప్పుఁడు. మరణంబు గల్గులోనఁ దగు విధానంబు నెద్దియే నాతం డాలోచించుకొనఁ గలఁడు!

"చ॥ ఉరగశవంబు నాదుమెడ నుంచితి వంచుఁ గృధాళునస్కుఁడై
యరమర లేక నాదుసుతుఁ డక్కట! "తక్షకదుర్విషాగ్ని నీ
వరిగెదుగాక! స్వర్గపురి", కంచు శపించెను బాల్యబుద్ధిచే
నరసికొనంగ నీ కగు; నృపా! భవితవ్యపుమార్గ మేదియో!

చైత్రి, కార్తి—భాగ్యము. (నిష్క్రమణము.)

[పటపరివర్తనము.]

---

రంగము 2 —పరీక్షిన్మహారాజు సభాభవనము.

(ప్రవేశము: పరీక్షిత్తు, మంత్రి).

పరీ—మంత్రీ!

గీ॥ కలికమునకైనఁ గలిబాధ కానరాని
యట్లు, సుఖియించుచుండిరే యవనిజనులు?
ధర్మదేవత నాల్గుపాదములతోడ
నిపుడు నిర్భీతిఁ జరియించునే? సఖుండ!

మంత్రి—ధర్మపరిపాలనసేయఁ గంకణముఁగట్టుకొనిన దేవరవారి రాజ్యకాలమున కలిబాధలునుం గలుగునా? మహాప్రభూ!

(భటుఁడు ప్రవేశము.)

భటు—(నమస్కరించి) మహాప్రభూ! పరాకు.

పరీ—ఏమిరా అది?

భటు—స్వామీ! కోలాహలుఁ డను పేరుగల మాంత్రికుఁడఁట! తమదర్శనమునకు వచ్చియున్నాఁడు!

పరీ—ప్రవేశపెట్టుము.

(భటుఁడు నిష్క్రమింపఁ గోలాహలుఁడు ప్రవేశము).

కోలా—రాజ మార్తాండా! జోహారు!

పరీ—ఓయీ! నీ వెవ్వఁడవు?

కోలా—స్వామీ! నే నొకమాంత్రికుఁడను. తమ యాస్థానమున నా విద్యం బ్రదర్శించి మెప్పొందవచ్చితిని.

(భటుఁడు ప్రవేశము.)

భటు—మహాప్రభూ! పరాకు.

పరీ—ఏమిరా?

భటు—శమీకముస్యాశ్రమమునుండి యెవ్వరో మునిపుత్రులు వచ్చి దర్శనము నపేక్షించుచున్నారు.

పరీ—సత్వరముగా రానిమ్ము. మాంత్రికుఁడా! నీవిద్యను పరీక్షింతుము; కొంతతడవు వేఁచియుండుము.

(భటుఁడు నిష్క్రమణము.)

కోలా—చిత్తము.

పరీ—(స్వగ.) ఏమికారణంబుననో కాని, నాకీ వార్త హృదయవిదారకముగ నున్నది. ఇప్పుడీ మానులరాక కేమి కారణము?

(అనుబంధము 13.)

(చైత్రుఁడు - కార్తికుఁడు ప్రవేశము.)

చైత్రు—<br>కార్తి— } విజయతాం విజయతాం రాజన్.

పరీ—(నమస్కరించి) మునిపుత్రులారా! నమస్కారము. మీరాకచే నాదేహగేహంబులు పవిత్రవంతము లయ్యెను. దయచేయుఁడు! ఈ యాసనమును పూజ్యముగా నొనరింపుఁడు.

చైత్రు— } (ఆసీను లగుదురు.)
కార్తి— }

పరీ—మునిపుత్రులారా! మీ గురువరులకు సేమమా? బ్రహ్మచారులయందగ్రగణ్యతవహించిన మీమిత్రుఁడగు శృంగికిఁ గుశలమా?

ఉ॥ పావనుఁడౌశమీకి మిముఁబంపిన కారణ మేమి? యూరకే
దేవర లిట్టిచోఁటి కరుదెంచరు; శ్రీకరమౌ త్వదాశ్రమం
బావనభూములందు ననయంబుఁ జెలంగు నె? శాంతరీతి, భూ
దేవతలెల్లవారు సుగతిం గనియుందురుగా సుఖంబుగన్?

చైత్రు—నీవంటిరాజులు పరిపాలించుచుండఁగా మావంటిమునుల సుఖంబుల కేమి కొఱంత?

కార్తి—మదోన్మత్తు లగు మీవంటిరాజులకు మునులయోగక్షేమ విచార మవసరం బయ్యెనా? ఎంత విచిత్రము?

పరీ—మహాత్ములారా! మీ వైఖరిం జూడఁగా వేరొకవిధంబునఁ గనఁబడుచున్నది.

చ॥ ఎఱుఁగక సజ్జనావళికి నెగ్గొనరించితినో పరాకునన్.

చైత్రు—ఎఱుఁగక యేమి? ఎఱిఁగియే చేసితివి.

కార్తి—కండకావరమునఁ గన్నుమిన్నుఁగానక చేసిన దుష్కార్యము పరాకగునా?

పరీ—చ॥ ఇరవగు నాశ్రమంబు నలయించితినో మృగయావినోదినై?

చైత్రు—మహాత్ములగు శమీకమునీంద్రులతపఃశక్తిచే సురక్షితంబగు నాశ్రమంబు నలయింప నీ కెట్లు సాధ్యమగును?

పరీ— చ॥ వరసవనాది కార్యములు భంగమునందఁగ నూరకుంటినో?

చైత్రు—"దేవాలయధూపన్యాయముగ" నీవు దోషముల నొనరింపకున్న నితరులదోషములను నివారించినంతఫలము.

పరీ—దేవా! [illegible]ల్లయిన మహాత్ముల యెడల నేను స్వయముగా నప
చారి నైతినా?

చ॥ అరసి మదీయదోషము దయామతులార! యెఱుంగఁ జేయరే!

చైత్రు—ఆత్మదోషము నీ కెంతలో మఱపునకు వచ్చెను!

కార్త్రి—కపటాత్ములగు రాజాధములకు పరాకుపడుట సహజగుణ
ముగదా!

పరీ— హరి హరీ! మునిబాలులారా! మీమనఃక్షోభంబంతయు, మీ
పలుకులవలననే తెలియుచున్నది. నే నొనరించిన మహాపాతక
ము నెఱిఁగించి మీ శాపాహతులచే నన్ను భస్మీభూతునిఁ జేయ
వేడుచుంటిని.

చైత్రు—అది, యిది వఱకే పూర్తియైనది. మాగురుసందేశమును
వినుము. నీసందేహము తీరఁగలదు.

("ఉరగశవంబు" అను పూర్వోక్తపద్యముం జదువును)

పరీ—హా! దైవమా! (మూర్ఛిల్లును.)

చైత్రు—కార్త్రికా! మనము వచ్చినపని యయినది. పోవుదము రమ్ము.

(ఇరువురును నిష్క్రమణము)

పరీ—(లేచి) [అనుబంధము 14.] దైవమా! నీభక్తుండ నగు నాకి
ట్టిపాటుఁ గూర్పఁబాడియా? నిరతము, నీచరణసరోరుహ
ధ్యానమే శరణమని నమ్మియుంటినిగదా! నాబుద్ధి నంత
లో మరల్చి పరమపూజ్యుఁడగుమునీంద్రునికంఠభాగంబున
సర్పశవంబు నిడు దుర్బుద్ధిని నా కేల నొసంగితివి? తుట్టతు
దకు నా కిట్టి దుష్ప్రాప్తినిఁ గలిగించితివా? దుర్వ్యసనాసక్తిం
దగులని నే నేల వేఁటకేగితిని? ఏగియామునీంద్రునిం గని,
దాహబాధ నోపలేక. యుక్తాయుక్త విచారశూన్యుండనై
యిట్టి పాపకార్యం బేలఁ గావించితిని? ఒక్కనాఁడైన
సాధువుల కెగ్గుదలంపనోపని, నామానసం బానాఁ డట్లేలఁ

గావలె? ఇది నా నాశనంబునకుఁగాదా! ఓశృంగీ! నన్ను తక్షకఘోరవిషానలంబున మరణింపు మని శపించితివా! నే నంతటిఘోరశాపంబునకుఁ దగుదునా? ఏల తగను? తండ్రి నారీతి పరిభవించినప్పుడే కుమారుఁ డూరకుండఁ గలఁడు? పితృభక్తిపరాయణుండవై శపించిన నీయందుదోష ములేదు. పూజ్యుఁడగు శమీకుని హింసించిన, నాదే దోషము!..........అయినను, తక్షకునకు, నే నేమి యప రాధముఁ జేసితిని? అతఁడు నాయందేల వైరభావంబూనును? న న్నేల సంహరించును? కాదు-కాదు. మునుల శాపమాహా త్మ్యంబున విధియట్లు తోఁచికొనివచ్చును గాఁబోలును! తక్షకుఁడు నన్ను సంహరించునుగాఁబోలును! నా కీదుర్గతి తప్పదు; తప్పదు! నే నేమిచేయుదును? ఆమునిపాదములంబడి శాపమోక్షము ననుగ్రహింపు మని వేఁడ కొందునా?...... ఏమి నా వెఱ్ఱి! పితృపరాభవరోషదందహ్యమానాంతరంగుఁడగు శృంగి, నేను తనకంటబడినంతనే భస్మీపటలముచేయునుగాని శాపమోక్షము నొసంగునా?.....కల్ల......ఇంక నా కెం దునుఁదరణోపాయములేదు......ఊఁ!......ఇందుల కేల నే నింతగా వగవవలయును? పాపభూయిష్ఠ మగు నీప్రపంచము నుండి న న్నీవిధముగా విముక్తుంజేసి, నన్ను తన సన్నిధికిఁ జేర్చు కొనసంకల్పించి, కృపాంతరంగుఁ డగు భగవంతుఁ డిట్లు కల్పిం చెనేమో! అట్లయిన నా కిప్పుడు హరినామస్మరణమే కర్తవ్యము.

కోలా—దేవా! నామనవి వించుక యాలకింపవలయును.

పరీ—ఎవ రది?

కోలా—దేవా! నేను కోలాహలుఁ డను మాంత్రికుఁడను.

పరీ—కోలాహలా! నీశక్తిని పరీక్షించుటకు మా కిప్పుడు మనః ప్రమోద కాల మంతరించినది. ప్రాణాసన్న కాలము వచ్చినది! కావున బహుమతుల నంది, పోయిరమ్ము.

కోలా—ప్రభూ! మీసేవకునకు బహుమతు లక్కర లేదు; మీరు జీవించుటయే కావలసినది.

పరీ—నా కింక జీవితాశ యేమియున్నది?

కోలా—దేవా! యీ కోలాహలుఁడు జీవించియుండఁగా మీప్రాణముల కేమియును భయము లేదు!

పరీ—ఏమి? మునిశాపము నెదుర్కొనఁగల్గునంతటి తపఃశక్తి నీకుఁ గలదా!

కోలా—తపఃశక్తి లేదుగాని — తక్షకుని గడగడలాడింపఁగల మంత్రశక్తి గలదు. నన్నుఁ బంపిచూడుఁడు; నాప్రతాపము చూపెదను.

ఉ॥ తక్షకదుర్విషంబు నిఁక దగ్ధముఁ జేసెద; యక్షకిన్నరా
ధ్యక్షులు గావవచ్చిన, సురాసుర కాండము వేడఁబోయినన్
రక్షణసేయు మంచు, నహిరాజపదంబును దూరఁబోయినన్
శిక్షితుఁ జేతు మీదరినిఁ జేరకయుండఁగ శాశ్వతంబుగన్.

పరీ—కోలాహలా! అంతమహత్కార్యమే నీ వొనరించినచో, నీకర్ధ రాజ్యంబును ధారపోసెదను. ఆలసింపక యరిగిరమ్ము.

కోలా—భాగ్యము. (అందఱును నిష్క్రమణము)

[పటపరివర్తనము.]

---

రంగము 3—ఒక యరణ్యము.

(ప్రవేశము: తక్షకుఁడు.)

తక్ష—(అనుబంధము 15). మునీంద్రులవాక్యం బవశ్యము ప్రవర్తింపఁదగినది. మద్విషాగ్నులచే హతమగునట్లు పరీక్షిత్తును శృంగి శపించెనని నారదువలన నిప్పుడే వింటిని. తన్నియోగంబును నడుపవలయును. (పోఁబోయి, ఇంచుక శాంతించి) ఛీ! నే నెందుఁ జనుచుంటిని? పరీక్షిన్నరేంద్రునిమారణము చేయుట కా?

ధర్మప్రతిష్ఠాపకుఁ డగు పాండవపౌత్రునకు మరణము నాపా
దించుటకా చనుచుంటిని?

ఉ॥ ద్రోహము నెన్నఁడేనియు నెఱుంగఁడు సాధువులం దధర్మసం
దోహము నార్చి కీర్తి భరితుండయి, శ్రీహరిపాద దాసుఁడై
బాహుబలంబుచే విమతవర్గముఁ గూల్చిన పుణ్యమూర్తిపై
సాహసమూనఁగా విబుధసంఘము మెచ్చునె? కీర్తి హెచ్చునే!

అదిగాక నా కీపరీక్షిత్తు చేసిన దోషమేమి? శృంగి చేసిన ప్రీతియేమి? అట్టియెడ, నొకరిని హింసించినందువలన నాకు వచ్చు లాభ మేమి? పాండవపౌత్రుం డగు పరీక్షిత్తుం జంపిన వాఁ డెవ్వఁ డనిన, "తక్షకుండు, తక్షకుం" డని కలకాలము జను లాడిపోసికొనుటమాత్ర మొక్కటి మిగులఁ గలదు. కావున నే నీదుష్కార్యము నాచరించువాఁడను గాను. వెనుకకు మఱలెదఁగాక! (వెనుకకు నడచి మరల శాంతించి) ఆఁ! ఏమి తలఁచితిని? నా కీపరీక్షిత్తు చేసిన యుపకార మేమనియా? లేకేమి! కావలసినంత యున్నది! వీని తాతయగు నర్జునుఁడు ఖాండవదహనకాలమున నాబంధువులనుగా దా హతమార్చినది!— అం దొక్కఁడు మిగిలిపోవఁగా కర్ణవధాసమయమున వానిని నయితము సంహరించెఁగదా! ఇంతకన్న నపకారము కావలయునా?—అదిగాక వీఁ డేమో పుణ్యాత్ముం డని నేను పొగడుచుంటిని. మునిజనవిద్రోహి యగు వీఁడా పుణ్యాత్ముఁడు? అవశ్యము వీని కీశిక్ష కావలసినదియే! అవి యన్నియు నట్లుండ—నేను వెట్టియూహలందుఁ జిక్కి—తన నియోగమును నడుపక పోయినచో శృంగి నన్ను శపియించిన నాగతి యేమి? తన్ను మాలి నధర్మ మెంతదైన నుండునా?- కావున నే నాందుష్టుని, నావిష జ్వాలలచే సంహరింపనే వలయు!—ఇప్పుడే చనియెదఁగాక!

(పోఁబోవఁగా ఎదురుగా కోలాహలుఁడు ప్రవేశము)

కోలా—ఓహో! తక్షకా! నిలునిలు — ఎందుఁ బోయెదవు?

తక్ష—ఎవ్వఁడవురా! నాగమనంబు నాటంకపఱచెదవు?

కోలా.—నేను కోలాహలనామధేయుండ నగు విషహూంత్రికుఁడను. భస్మీకరణము నీవంతు – ప్రాణప్రతిష్ఠ నావంతు.

తక్ష—అట్లయిన నీవు దేనికి ప్రాణప్రతిష్ఠ చేయఁగలవు?

కోలా—నీవు దేని భస్మపటలముగ చేయఁగలవో నేను దానికిఁ బ్రాణ ప్రతిష్ఠ చేయఁగలను.

తక్ష—అట్లయిన నీవు నాపై వైరము సాధింపవచ్చితివా?

కోలా—నీవు సఖ్యమున నుండనిచో—

తక్ష—నాసఖ్యమునకుఁగాని నీవైరమునకుఁగాని కారణ మేమియైనఁ గలదా? లేక మంత్రవిద్యాగర్వమే కారణమా?

కోలా—కారణము లేకేమి? కావలసినంత యున్నది!

తక్ష—అది యేది?

కోలా—ఇప్పుడు నీ వేయుద్యమమున నరుగుచుంటివో—యదియే కారణము.

తక్ష—పరీక్షిచ్చరిత్రమా?

కోలా—సందేహ మేమి?

తక్ష—నిన్ను పరీక్షిత్తు పంపినాఁడా?

కోలా—అతఁ డేల పంపవలయును? నేనే వచ్చితిని.

తక్ష—నీయుంతట నీవు వచ్చుటకు నీకు సంబంధ మేమి?

కోలా—పరీక్షిత్తు శమీకుని మెడకు మృతసర్పముం జుట్టఁగా—నాతనిఁ జంపవచ్చుటకు నీకుఁగల సంబంధ మేమి?

తక్ష—బ్రాహ్మణవాక్యము పరిపాలనార్థము—

కోలా—రాజరక్షణము పౌరులకు నయిత మవశ్యమే!

తక్ష—ఆఁ! ఏమిరా! నాతోఁ బ్రతివాదమును సలుపవచ్చితివా?

గీ॥ పదియు నాలుగు జగములు భయద మైన
మద్విషానలహూతిచేత మండిపోవ;
నెదిరి ప్రతిభాషలాడెదు; బెదర వేల?
చెడెద వీక నీస్థలంబును విడిచిపొమ్ము.

కోలా—ఓరీ! యాత్మశ్లాఘుపరాయణా! మదోన్మత్తా!

గీ॥ ఉరగహూతి నీల్గ లోహితాస్యుండఁగాను;
విధిహూతుండగు నలమహీవిభుఁడగాను;
సాహసముఁజూప వీఁడు కోలాహలుండు!!
తక్షకా! యెవ్వఁడని మదిఁ దలఁచినావొ!

తక్ష—ఓరీ! తక్షకనామసంస్మరణమాత్రమున జగములు కల్లోలము నందుచుండఁగా నీవు నన్ను గెలువఁగలవఁటరా! మేర మీరి వాదించెదవు! వెకలీ!

కోలా—వట్టిమాటలతో నేమిప్రయోజనము? నాశక్తియు, నీశక్తియుఁ బరీక్షించినఁగదా తెలియఁగలదు.

తక్ష—అట్లయిన నిటు చూడుము. ఈవృక్షము ఫలపత్రపుష్పసంభరితమై యున్నది. నా విషజ్వాలలచేత దీనిని భస్మముచేసెదను చూడుము.

(తక్షకుఁడు సర్పాకృతిం దాల్చి వృక్షమును భస్మము చేయును)

తక్ష—(యథారూపమును దాల్చి,) చూచితివా, నావిషజ్వాలా మాహాత్మ్యము! ఈజ్వాలలందే పరీక్షిత్తును నీవును గూడ మసియై పోవఁగలరు!

కోలా—ఓహోహో! ఏమి యబ్బురము! ఇదియా నీప్రతాపము! నీవు నాశముచేయఁగలవుగాని సృష్టిచేయఁజాలవుగదా!

తక్ష—నీవు చేయఁగలవా?

కోలా—నేను సృష్టిస్థితిలయముల కేకమూర్తిని, త్రిమూర్తులపైఁ దురీయమూర్తిని.

తక్ష—కానిమ్ము—అట్లయిన, నావలన భస్మముచేయఁబడిన యీవృక్షమును చిగుర్పఁజేయుము. నీశక్తి కాంచెదను.

కోలా—చూచుచుండుము; ఒకలిప్తమాత్రపుఁ బని.

[ఓషధులఁ బ్రయోగింపఁగా వృక్షము చిగుర్చును]

తక్ష—ఓషధుల సహాయమున గెలువఁగల్గితివి. ఇది వైద్యశక్తిగాని, మంత్రశక్తి కాదు. ఇప్పుడీ కష్టమునుండి విముక్తుఁడవుగమ్ము. చూచెదను.

[మంత్రింపఁగా అనేకసర్పములు జన్మించి కోలాహలునిపైఁ బడును.]

కోలా—(మయూరాకృతితోఁ గాన్పించును)

కోలా—తక్షకా! ఇప్పుడేమైనది?

తక్ష—(రోషదుఃఖములతో) హా! హా!! ఇది యెట్టి దుష్పరిణామము! నన్ను మీఱినఘటికుఁడగునే యీ కోలాహలహతకుఁడు! నే నేల నిర్నిమిత్తంబుగఁ బరీక్షిత్తుపైఁ బగసాధించితిని?—హుం—సాధించితిఁగాక! ఇప్పుడేటి భీతి? కానిమ్ము; వీనితో పగసాధించుట సమ్మతముగాదు. హితంబుననే వీనిని లోఁబఱచుకొందును గాక! (మణిహారముం దీసి, ఆనందము నటించుచు) మిత్రుఁడా! నిన్నొక సామాన్యపురుషునిగాఁ దలంచితిని. ఓహో! ఏమి నీయద్భుతశక్తి? నీసామర్థ్యము నా కాశ్చర్యముం గలిగించినది! కావున నీ కీమణిహారమును బహుమానముగా నిచ్చుచున్నాను. ఇది యమూల్యమైనది; గైకొనుము—(ఈయఁబోవును)

కోలా—(ఆశ్చర్యముతో) ఓహో! ఏమి యీమణులకాంతివైభవము? ఇతఁడు తక్షకుఁ డగుటచేత నివి నాగలోకమణులై యుండును. ఇవి అమూల్యములఁట! ఏమి నాభాగ్యము!

తక్ష—మిత్రమా! మనమన తారతమ్యంబు లొండొరుల మెఱుంగనంతదనుక మాత్సర్యంబున వాదించుకొంటిమి. కాని యిప్పుడు మన మేల మైత్రినిఁ జెలంగరాదు?

కోలా—మనకు మైత్రిగాక శత్రుత్వ మేమి యున్నది? (మణులను జూచుకొనుచుండును.)

తక్ష—(స్వగతము) వీఁడు మణులను గాంచి యాశాపీడితుఁ డైనాఁడు. వీనియాశ నభివృద్ధి గావించి, లోఁబఱచుకొనుట కిదియే సమయము. (ప్రకాశము) మిత్రమా! ఈ మణులకే యాశ్చర్యపడుచుంటివా? ఇంతకన్న నమూల్యము లగు మణులను కోటానుకోట్లుగా నీ కర్పింపఁగలను చూడుము.

గీ॥ నాగలోకనివాసుల భోగములను
మణిచయమునకుఁ గొఱఁత యన్మాట లేదు;
వలయునెడ వానినెల్ల నర్పణముఁ జేసి,
నిన్ను ధనికునికన్నను మిన్నఁ జేతు.

కోలా—(స్వగతము) నాయదృష్టవశమున నే నేఁడు తక్షకునిఁ గలిసికొంటిని. ఇతనితోఁ బగ నాకు హితముగాదు. పరీక్షిత్తు నా కర్ధరాజ్యమునుమాత్రమే యిచ్చెద ననియె కాని, యది యీ మణులయెదుట నేపాటి?—ఎవ రెట్లు పాడైన నా కేమి? నాలాభము నే నేను చూచుకొనవలసినది!

తక్ష—మిత్రమా! కోలాహలా! నన్ను జయించినచో నీ కేమి బహుమాన మిచ్చెద నని పరీక్షిత్తు నీ కాశను జూపినాఁడు.

కోలా—అర్ధరాజ్యము.

తక్ష—మాటవరుస కొకవేళ నీవు నన్ను జయింతువే యనుకొమ్ము. తన వాగ్దానప్రకారముగాఁ బరీక్షిత్తు నీ కర్ధరాజ్యము నిచ్చెననుకొమ్ము.

కోలా—అనుకొమ్మనుమాట యేల? అట్లు జరుగుట యే నిశ్చితము.

తక్ష—సరి; నే నిప్పుడు కాదంటినా? నీవు నన్ను జయించితివి. నీ కర్ధరాజ్యము లభించినది. ఇంత శ్రమపడి, నీవు రాజ్యమును సంపాదించుకొనుట పరరాజుల కర్పించుటకే కదా!

కోలా—అం! అ ట్లేల జరుగును?

తక్ష—కాకున్న నీకు రాజ్యపాలనమునందు నేర్పుగలదా?

కోలా—రాజ్యపాలనమునందా? — నేర్పా?

తక్ష—ఇంక నను హాస్యించుచుంటివా? కత్తిఁబట్టి శత్రువులతోఁ బోరాడఁగలవా?

కోలా—అబ్బా! నావలనఁగాదు.

తక్ష—ధర్మశాస్త్రముల నేమైనఁ జదివితివా?

కోలా—మంత్రశాస్త్రము దప్ప మఱియేదియు నెఱుగను.

తక్ష—సింహాసనమునఁ గూరుచుండి, నిఖిలజనులను శాసింపఁగలవా?

కోలా—మంత్రములు లూది పాములను వశపఱచుకొనుటదప్ప రాజ్యతంత్రముచే మానవులను వశపఱచుకొన నభ్యాస మెక్కడిది?

తక్ష—ఇంతవఱకు నీకు రాజ్యపాలనశక్తి లేదనుట విస్పష్టమైనదా?

కోలా—ఐనట్టులే.

తక్ష—ఇంకను సందేహముగూడ గలదా?

కోలా—సందేహ మెందులకు? నాకు రాజ్యపాలనము చేతగాదు.

తక్ష—అట్లయిన నీవు పరీక్షిత్తువలన రాజ్యలాభము నంది చేయునదియేమి?

కోలా—రోదనము.

తక్ష—సరిగదా! నీ కింతకన్న లాభకరమగుమార్గము చూపుమందువా?

కోలా—అంతకన్న కావలసిన దేమి?

తక్ష—మనకు ధనము ప్రధానముగాని, రాజ్యభోగములు కావు. ఒకవేళ నవి మనకు చేఁజిక్కినను దక్కఁబోవు. కావున

మన మిద్దఱమును గలిసి, యాపరీక్షిత్తును చంపుదము. నేను నీకు మహాధననిధుల నిచ్చెదను. (అనుబంధము 16)

కోలా—ఆఁ! ఆ!! ఏమంటివి?

తక్ష—పరీక్షిత్తును జంపుదుమంటిని?

కోలా—అబ్బా! నే నట్టి పాపకార్యమును జేయలేను.

తక్ష—వెఱ్ఱివాఁడా! నీ కిప్పుడు పాపపుణ్యవిభాగచింతయా?

కోలా—తక్షకా! నీసర్పగుణమును విడువవైతివిగా! ఎట్టిపుణ్యాత్ముని సంహరింపఁదలఁచుచుంటివి!

తక్ష—ఆఁ! పుణ్యాత్ముఁడా! ఎవఁడు పుణ్యాత్ముఁడు? మునిజనంబుల నవమానించినవాఁడా? దూరీకృతవిప్రభక్తిపరాయణుఁడా? హేయమనక—దుశ్చింతయనక—దర్యశోపాపకమనక— చచ్చిన పామొందెచ్చి మునిమూపునఁగట్టిన కలుషకర్ముఁడా?

కోలా—సరే! పరీక్షిత్తు పాపాత్ముఁడే! కానిమ్ము; అతనిం జంపుటకు పాయాంతర మేమి యున్నది?

తక్ష—అట్లు దారికి రమ్ము. నీ వొక బ్రాహ్మణవేషమున పరీక్షిత్తుకడ కరిగి, యాతని కొక నిమ్మపండును బహుమతిగా నిమ్ము. నే నా ఫలాంతరమున నణఁగియుందును. ఫల మాతఁ డాఘ్రాణింపఁగనే నేను నాశికాపుటంబుల దూరి, కఱచి మద్విషంబున మరణముఁ గల్పింతును.

కోలా—హరిహరీ! ఎంత దారుణము?

తక్ష—మరల చెవులు మూసికొనుచుంటి వేల? ఇట్లు సంశయాకులుఁడ వైనచో ధన మెట్లు లభించును? రవంత శ్రమవహించితివా పాతాళమునందలి మణులన్నియు నీధన మగునే!

కోలా—సరే! హరిహరీ లేదు; హరహరా లేదు. సమ్మతించితిని లే.

తక్ష—అట్లయిన నికఁ బోవుదము; రమ్ము.

కోలా—ఎక్కడికి?

తక్ష—పరీక్షిత్తును బరిమార్చుటకు.

కోలా—అట్లుగాదు. తొలుత నాకు మణుల నిమ్ము; పిదపఁ బరీక్షిత్తు కడ కరుగుదము.

తక్ష—వెఱ్ఱివాఁడా! మాట తప్పుదు ననుకొంటివా?

కోలా—రెండునాల్కలుగల నీవే మాట తప్పనప్పుడు ఒక్కనాల్కగల నేను తప్పుదునా?

తక్ష—ఐన మనలో మనకు సందేహము లేల?

కోలా—కాదు; తొలుత నాపని కావలెను.

తక్ష—అట్లయిన, నిప్పుడే పాతాళమునకుఁ బోవుదము రమ్ము.

కోలా—(అనుబంధము 17)

(ఇద్దఱును పాతాళమునకు నిష్క్రమణము.)

[పటపరివర్తనము.]

---

రంగము 4 — పరీక్షిత్తు శయనమందిరము.

పరీ—(నిద్రలో నులికిపడి లేచి) తక్షకా! కఱవకు కఱవకు. నేను నీ కేద్రోహమును జేసియుండలేదు. నీయెడల నిరపరాధిని. నన్ను నీ భయంకరదంష్ట్రాంతరంబున నిరికించి, భీషణ హాలాహల ప్రయోగము నొనరించి, మారణము జేయుటకుఁ బ్రయత్నించు చున్నావు! — హా! బీభత్సము! నీయాకృతి నాకు మహాభీకరమై కాన్పించుచున్నది! నీ నోటినుండి భీకరాగ్నిహోత్రజ్వాల లుద్భూతములై బ్రహ్మాండములను లయకాలకాల దండాగ్రకీలామాలికలవలె, శంకరఫాలలోచనోదితజ్వాలా మాలలవిధంబున మండించి, మసిఁజేయ నుద్యమించుచున్నవి. ఉపసంహరింపుము; ఉపసంహరింపుము. అతిదూరస్థంబగు నీక రాళమునుండి, యింతదూరమునందున్న నా పైపైకి వచ్చుచుఁ గబళింప సముద్యమించు నీదీర్ఘములగునవి యేమి? విషపూ

రితము లగు నీజిహ్వలా? దయామయుండవగు నో తక్షకా! నీవిషజ్వాలలందు నేను దగ్ధుండనై పోవుదును. వెనుకకుఁ దీసికొనుము. నీకింతటి దౌర్జన్యవృత్తి యర్హము కాదు.— అబ్బా! ఇది యేమి భీకరాకారము? ప్రార్థించినకొలఁదియుఁ బయిపయికి వచ్చుచున్నావే!......ఛీ! క్రూరసర్పమా! నీకు దయ యెక్కడిది? నిన్ను ప్రార్థించిన నేమియగును? తగదు; తగదు. నిన్ను ప్రార్థింపనే తగదు. దయాపరిపూర్ణుఁడగు శమీకమునిం బ్రార్థింతును.— (వేరొకవంకకుఁ దిరిగి) మునీంద్రా! శమీకమునీంద్రా! బ్రహ్మణ్యుండ వగు నీ వనుగ్రహింపకున్న, నిం కెవ్వ రనుగ్రహింతురు? పాదములఁబడ్డ దీనునిఁ బరిరక్షింపకుండుట తగునా? ఇట్టివి, నీబోఁటివారి కగునా? నీ కుమారుని నీవు మందలింపవా? ముని కీదురాచరణము తగునా, యని పలుకవా? పాపోపసంహారముఁ జేయింపవా? చేయవా? ............అదుగో! శృంగి!! అదుగో శృంగి!! —శృంగీ! శృంగీ! మహానుభావుండగు నీజనకున కెగ్గుచేసితిని. శవసర్పముం దెచ్చి నీతండ్రిగళంబునం జుట్టితి, మహాపాపకర్ముఁడను. క్రోధతామ్రాక్షుండవై నాపైకి రాకుము; నాపైకి రాకుము. శాపోదకములం జల్లకుము. శాంతి వహింపుము.—అబ్బా! భయంకరము! భయంకరము!! యమకింకరులారా! నన్ను దరియ రాకుఁడు. మీశూలంబులను తీవ్రగతిని, నాపై విసరకుఁడు. నన్నగ్నిగుండంబులం గట్టి పార వేయకుఁడు. నా యార్తనినాదంబులను మీశమనప్రభుని శ్రవణపుటంబుల వేయుఁడు!— కాదు కాదు. మీరు మఱలిపోవలదు. మిమ్ము బతిమాలుకొందును; మీపాదములంటి వేడుకొందును. మీరు పాపభయంకరులు; నన్ను రౌరవాదినరకములం బడవేసి, పొరలింపుఁడు! గదల మోదుఁడు. కాయంబును ప్రేల్చుఁడు. కారముం గూరుఁడు. ఇంతకన్న నాపాపంబున కెఁక నిష్కృతి లేదు.—ఓసీ! దుష్టసర్పమా! చచ్చినదానవు మఱల నేవిధమున బ్రతికివచ్చితివే! నీ కెన్ని చావుబ్రతుకు లున్నవి!—నీవు చచ్చు

టచేఁగదా నేను నిన్ను మునీంద్రుని కంఠమునకుఁ జుట్టితిని! ఇప్పుడు బ్రతికి యెట్లు వచ్చితివి.........హా! హాతాశుఁడ నైతిని. తక్షకా! తక్షకా! నిన్ను గుర్తింపనైతిని! నీ వఁటరా? నన్నుఁ జంపవచ్చితివా? రమ్ము. నన్నుఁ గబళింపుము; నీకడుపు నింపుకొనుము. నిన్ను నేను రక్షింపు మని వేఁడలేను. ప్రార్థింపఁబడలేను......ఆహాహా! ఏమి! నా భాగ్యము! ఏమి నాభాగ్యము! క్షీరసాగరమధ్యస్థుఁడై — నిత్యసూరులతోఁ గలిసి, లక్ష్మీనారాయణమూర్తి కనంబడుచున్నాఁడు; నా కవశ్యము ప్రసన్నుఁడగును. నారాయణా! శ్రీమన్నారాయణా! అనాథరక్షకా! ఆద్యంతశూన్యా! త్రిగుణాతీతా! రమ్ము. నా యార్తి నివారింపుము. నిన్నుఁ బ్రార్థింతును. (అనుబంధము 18)

[మూర్ఛిల్లును.]

[నారద శుక వ్యాసులు ప్రవేశింతురు.]

పరీ—(తత్తరముతోఁ లేచి) నీబిడ్డఁడనే నారాయణా! నీదాసుఁడనే దయాభరణా! నీబాలుఁడనే భక్తవరదా! జాలిందూలి, పాదంబులంబడిన నాసంహారంబున కుద్యమించెదవా? నన్నుఁ దుంచెదవా!—కాదుకాదు; నేను భీతిచే నిన్ను తప్పు దలంచితిని. ఇది నన్ను సంహరింప నెత్తిన చక్రము గాదు; దుష్టతక్షకవధార్థమై నీవు సుదర్శనంబు నెత్తితివి! చంపుము; స్వామీ! తక్షకునిఁ జంపి నన్ను రక్షింపుము. (వ్యాసాదులం గాంచి) శ్రీమన్నారాయణా! ఇప్పుడు వచ్చితి. తనతండ్రిపై నురుగ శవంబు నిడితినను నాగ్రహంబున, శృంగి యీతాపసులను, నన్నుఁ జంపఁ బంపినాఁడు. దేవా! నన్ను రక్షింపుము. నా కింక దిక్కు లేదు. నే నెందుఁబోఁపుదును? ఎందుఁబోవుదును? (అటు నిటు పరుగెత్తును)

నార—పరీక్షిన్న రేంద్రా! ఏమి యీభ్రాంతి?

పరీ—పాపమునకుఁ బ్రాయశ్చిత్తము ననుభవింపవలయు; అనుభవింపవలయు. నారాయణా! నాకు తరణోపాయము లేదా, నాకు తరణోపాయము లేదా! (మూర్ఛిల్లును.)

నార—శుక మునీంద్రా! ఇది యేమి? పరీక్షి త్తిట్లు పలువరించుచు న్నాఁడు!

శుక—కళంకితం బగు నీతనియంతరాత్మ - యిట్లు బాధించుచున్నది; పాపము!

నార—బాధింపనీ - సాధింపనీ; భక్తశిఖామణి యగు నీతనికి తరణో పాయమును జూపవలయును.

వ్యాసు—కుమారా! శుకా! మునిశాపము జరుగుటకు నేఁటికింకను సప్తవాసరములు గలవు; నేఁడు శుద్ధషష్ఠి! ద్వాదశి నాఁటిద నుక నీ వీతనికిఁ బుణ్యకథాగోష్ఠి సల్పుము.

శుక—తండ్రిగారి యాజ్ఞ.

పరీ—(లేచి) అనుభవింపవలయునా? అనుభవింపవలయునా? ఏల యనుభవింపవలయును? శృంగిపాటి తపశ్శక్తి నాకడ లేదా? నే నీతనికిఁ బ్రతిశాపము నీయఁజాలనా? (క్రోధముతో లేచి) ఓబకునుగుతాపసులారా! మిమ్ము శృంగి పంపనిండు; శృంగి పండనిండు. — మీరు నన్ను జంపుటకే వచ్చితిరేని, యిదే మిమ్ము నాశాపబలంబున హోమమార్చెద! నిలుఁడు; నిలుఁడు.

నార—పరీక్షిన్నరపాలా! ఎందుల కీ క్రోధావేశము? ఏమి యీ యున్మత్త ప్రలాపములు!

గీ॥ ఇతఁడు వ్యాసమునీషి విఖ్యాతకీర్తి;
యితఁడు శుకమౌని తత్సుతుం డిద్ధచరితుఁ;
డేను నారదుఁడను; విను; మిపుడు నీకు
బంధురశుభంబులను గూర్ప వచ్చినాము.

పరీ—కాదు; కాదు. మీరు నన్ను మోసగించుచున్నారు! శమీక మునీంద్రుఁడు మిమ్ముఁ బంపెనా? కాక, శృంగి పంపెనా?

శుక—భూపాలకా! నీవు మిగుల భ్రాంతుఁడవై యున్నావు! పరాకు మాని, యిట్లు పరికింపుము. మేము నీశత్రులము గాము.

పరీ—(సరిగాఁ జూచి) నే నెంత యపచారము చేసితిని? మహాత్ము లారా! అకారణముగ మిమ్ము దూషించి యిప్పుడున్న పాపము చాలక, యెక్కుడగు నఘమును సంపాదించుకొంటినిగదా! భగవానులారా! నాకేదో యొకమార్గముం జూపినఁగాని, మీ పాదములను విడువను. (పాదములం బడును)

శుక—పరీక్షిద్భూపాలకా! దఃఖింపకుము. నీకు మోక్షమార్గమును గల్గించుటకే వచ్చితిమిగాని, వేఱొండు గాదు. శృంగిశాపమె ట్లును నీకు తప్పదు. కావున, నీ సప్తాహంబులమితియందును, ద్వాదశస్కంధంబులుగల భాగవతమహాపురాణంబు నాలకింపుము.

పరీ—మహాత్మా! శుకయోగిసత్తమా!

ఉ॥ ఓపిక లేక, చచ్చిన మహోరగముం గొని తెచ్చి, కోపినై
తాపసుమూఁపుపై నిడిన దారుణచిత్తుఁడ మత్తుఁడ న్మహా
పాపుఁడ; మీరు పాపతృణపావకు లుత్తము; లయ్యలార! నా
పాపము వాయు మార్గముఁ గృపాపరులార! విధించి చెప్పరే!

వ్యాసు—నాయనా! విచారింపకుము!

సీ॥ లలితమై మంజుల లావణ్యభరితమై
ద్వాదశస్కంధసంభరిత మగుచు,
దశదిగ్పరివ్యాప్తవిశదమై, సత్ప్రభా
పూర్ణంబునై కృష్ణమూల మగుచు,
శ్రోత్రపేయంబయి, శుద్ధమై వరశుకా
లాపాభిరామవిలాస మగుచు,
సుమనోమనోజ్ఞమై శుద్ధపరిదీప్తి శో
భితచంపకాదిసువృత్త మగుచు,
వెలయు భాగవతాఖ్యపృథ్వీరుహంబు,
ద్వాదశీదినంబునందు సత్ఫలము నొసఁగు,
తన్మధురరసాస్వాదనతత్పరత న్నృ
పాల! పరమపదము నీవు పడయఁగలవు.

నీ కీ పురాణమును నాకుమారుఁ డగు శుకుఁ డుపదేశింపఁ గలఁడు;—పోవుదము రండు. (అందఱు నిష్క్రమింతురు)

[పటపరివర్తనము]

రంగము 5. — పురవీధి.

(ప్రవేశము:— తక్షకుఁడును బ్రాహ్మణవేషధారి యగు కోలాహలుఁడును.)

ఇద్దఱును— (అనుబంధము 19)

**తక్ష**—తృప్తి నొందితివా?

కోలా—ఇంతటి తృప్తి నా కే జన్మంబునఁ గలుగదు.

తక్ష—కార్యసాధనమైనపిదప నీ కింతకన్న ననేకసహస్రములగుమణుల నొసంగెదము. ఈమాట నాగరాజు చెప్పుటచేనైన నీకు నమ్మకము గలిగినదా?

కోలా—ఎంతమాటాడితివి! మిత్రమా! నీమాటయందు నాకు నమ్మకము లేదా! దాని నట్లుండనిమ్ము; నా వేషము సరిగా నున్నదియా?

తక్ష—దివ్యముగానున్నది. నే నిఁక నిమ్మపండులోఁ బ్రవేశించెదను. పరీక్షిత్తు నిష్ఠాగరిష్ఠుఁడై భాగవతమును వినుచున్నాఁడు, రమ్ము; పోవుదము. (ఇరువురును నిష్క్రమణము.)

[పటపరివర్తనము.]

రంగము 6.— కాలక్షేపశాల.

[శుచిర్భూతుఁడగు పరీక్షిత్తును, శుకుఁడును, మునులును ప్రవేశము.]

పరీ—మహాత్మా! ఈభాగవత మహాకావ్యంబును భగవానులరగు తమనోట, నీ సప్తరాత్రంబు లాలకించి, మిగులఁ జరితార్థత నందితిని. ఈదినమే ద్వాదశి! మహాత్ములారా! నాజన్మ

సాఫల్యముగాంచు దిన మిదియే! అండఱును నన్నాశీర్వదింపఁ బ్రార్థన.

[అంకఱు అక్షతలను చేతఁబూని ఆశీర్వదింతురు.]

( మంత్రపుష్పము )

సహస్రశీర్షందేవం । విశ్వాక్షం విశ్వశంభువం
విశ్వం నారాయణం దేవ । మక్షరం పరమంపదం॥
విశ్వతఃపరమాన్నిత్యం । విశ్వం నారాయణగ్ం హరిం
విశ్వమే వేదం పురుష । స్తద్విశ్వ ముపజీవతి॥
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం । శాశ్వత శ్శివమచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం । విశ్వాత్మానం పరాయణం॥
నీలతోయదమధ్యస్థా । ద్విద్యుల్లేఖేవభాస్వరా
నీవారశూకవ త్తన్వీ । పీతాభా స్వ త్వణూపమా॥
తస్యాశ్శిఖాయామధ్యే । పరమాత్మా వ్యవస్థితః
సబ్రహ్మసశ్శివస్సహరిస్సేన్ద్రస్సోఽ । క్షరఃపరమస్స్వరాట్॥
యోఽపాంపుష్పమ్.

[అక్షతలను పరీక్షిత్తుశిరస్సున నుంచుదురు.]

పరీ—నేఁడు ద్వాదశి! కావున బ్రాహ్మణసంతర్పణమును గానిండు; పిదప నావృత్తాంతము నాలోచింపవచ్చును.

[సేవకుఁడు ప్రవేశము]

సేవ—పరాకు రాజచంద్రా! పూజ్యుఁడగు నొక విప్రోత్తముఁడు వచ్చి దర్శనంబు నపేక్షించుచున్నాఁడు.

పరీ—ఈదినమున విప్రులగువారు నాయానతికై ప్రతీక్షింపనేల? శీఘ్రముగఁ బ్రవేశింపఁ జేయుము.

సేవ—(నిష్క్రమణము)

[నిమ్మపండుతో విప్రవేషధారియగు కోలాహలుఁడు ప్రవేశము]

పరీ—దేవా! మహానుభావా! పూజ్యులగు మీరిందు దయచేయుఁడు. నాయొసంగు చందనతాంబూలాది సత్కారములను స్వీకరించి పారణచేసి పోవలయునని ప్రార్థన.

కోలా—(స్వగతము) శత్రుండనై వచ్చిన నే నిచ్చట సత్కారముల నందరాదు; తొలుతనే నావచ్చినపనిని పూర్తిగావించుకొని పోయెదను. (ప్రకాశముగ) రాజచూడామణీ!

క॥ ధరణీపతులను గురువుల
నరసె కుసమయమున రిక్తహస్తంబులతో
నరుదెంచుట దూష్యంబగు
నరవర! యీఫలముం దెచ్చినాండం గొనుమీ.

పరీ—(కైకొని) బ్రాహ్మణప్రసాదము నానందమున స్వీకరించితిని.

[ఫలము నాఘ్రాణింపంగా తక్షకుండు కఱచును.]

పరీ—(బాధపడుచు) హా! హా!! ఇదియేమి? విధినిర్ణయమే విజయము నందినట్లున్నది! తక్షకునివంతమే నిర్వర్తింపంబడినది. మునీంద్రులారా! శ్రీమన్నారాయణుని యాజ్ఞయైనది. నేను పోవుచున్నాను. మీకందఱకివే ప్రణామశతంబులు; నాకు పుణ్యగతులు గలుగ నాశీర్వదింపుండు. శ్రీమన్నారాయణ - శ్రీమన్నారాయణ - శ్రీమన్నారాయణ. (మరణించును.)

కోలా—(చల్లగా పారిపోవును.)

అందఱు—(ఆశీర్వదింతురు.) (అనుబంధము 1.)

[పటపరివర్తనము]

---

## రంగము 7 — రాజభవనము.

(ప్రవేశము:— జనమేజయుండు.)

జన— (అనుబంధము 20)

కటకటా! నేఁడెట్టిదుర్వార్తను వింటిని! నాజనకుండగు పరీక్షిన్మహారాజు లోకసామాన్య మరణంబునగాక — తక్షక దర్వీకర ఘోరహాలాహలజ్వాలలచే నిహతుండయ్యెనంట! అట్టి పుణ్యస్వరూపునకా యిట్టి దుర్మరణము! ఇట్టిబెట్టిదంపువార్త

వినియు, తండ్రిగారి యాత్మక్షోభంబునకుఁ బ్రతీకారంబు
సల్పని నాజన్మము నిరర్థకంబుగదా!

మ॥ నియతిన్ మజ్జనకుండు తక్షకవిషాగ్నిం గూలెనే చేలమై;
దయఁ బూనం బని లేదు; పన్నగ కులౌద్ధత్యంబు చల్లాఱఁగా
భయదాస్మత్కరవాల దీధితులచే బాధించి శోధించి, వి
స్మయరీతిన్ ఫణిరాజవంశమును నే మాయింతు మాయాగతిన్.

[నారదుఁడు ప్రవేశము.]

(అనుబంధము 21)

జన—నారదమునీంద్రా! నమస్కారము.

నార—ఇష్టావాప్తిర్భూయాత్.

జన—మహాత్మా! నేఁడు నాహృదయము మిగుల చింతాకులమైయు
న్నది. నాతండ్రియగు పరీక్షిన్నరేంద్రుఁడు తక్షకుని వలన
కఱువఁబడి దిక్కులేని మరణంబు నొందెనని వినినప్పటినుండి
యు, తత్ప్రతీకారము చేసినగాని, నిద్దురపట్టకున్నయది. మహా
త్మా! నాకందులకై యెద్దియేని మార్గము నుపదేశింపుఁడు.

నార—తక్షకుఁడు నీతండ్రినిఁ జంపెను. అతనిని నీవు బాహుబలంబున
గెలువఁగల్గుట దుర్ఘటము.

జన.—తమ బ్రాహ్మణమంత్రబలము లేదా! అదిగాక, స్వామీ!
నే నొక్క తక్షకునిమాత్రమేకాక, సర్పవంశమునే నాశన
ముసేయు సంకల్పంబున నున్నాను. అది నెరవేరునట్టి వెఱ
వెఱింగింపుఁడు.

నార—వత్సా! ఇందులకై నీవు సర్పయాగము నొనరింపుము. బ్రాహ్మ
ణమంత్రబలమువలన సర్పంబు లన్నియును హోమకుండంబు
నం గూలి, భస్మమైపోవఁగలవు! పొమ్ము. నీ వాపనిమీఁద
నుండుము, నే నిదే వచ్చెదను.

జన—మహాత్మా! ఇది చక్కని యోచన. తత్కార్యనిర్వహణంబునకై చనియెదను; సెలవిండు. (నిష్క్రమణము)

నార—నేఁటితో నాగకులంబునకు మహాసంక్షోభకాలము వచ్చినది. తక్షకున కిప్పు డేది రక్షణోపాయము? (అటునిటుఁజూచి) అదుగో! తక్షకుఁ డిటే వచ్చుచున్నాఁడు. ఈ వృత్తాంతము నాతని చెవి నూఁదెదను.

(తక్షకుఁడు ప్రవేశము.)

తక్ష—[అనుబంధము 22]

(మీసము దువ్వుచు) భళిరా! ఏమినాప్రతాపము! కలిపురుషుని కాలఁదన్నిన పరీక్షిత్తువంతటిపరాక్రమశాలిని విషానలజ్వాలలందు భస్మీభూతునిఁ గావించితిని. జగంబులందు నన్ను గెలువఁజాలిన శూరుఁడెవ్వఁడు? ఇంక నేనరిగి నాగరాజువలన బహూకృతుల నందెదఁగాక! (పోఁబోవును.)

నార—తక్షకా! ఎందుఁబోయెదవింత రయంబున?

తక్ష—మహాత్మా! వందనము.

నార—ఎందుఁబోయెద వింత రయంబున?

తక్ష—నాగరాజుచే బహూకృతి నందుటకు.

నార—ఎందులకై నీకీ బహుమానము?

తక్ష—పరీక్షిత్తును బరిమార్చినందులకు.

నార—అట్లయిన నీవిప్పు డేబహుమానము నంద నపేక్షించితివి?

తక్ష—నాగరాజు ననుగ్రహము. ఏమియిచ్చినను సంతోషమే!

నార—కాదు; కాదు; ప్రాణభిక్ష నర్థింపుము.

తక్ష—ఆఁ. ఇప్పుడు నాప్రాణములకువచ్చిన భీతియేమి?

నార—వెఱ్ఱివాఁడా! నీకింకను దెలియనేలేదా?

తక్ష—మునీంద్రా! ఏమి యాదుర్వార్త?

నార—పరీక్షిన్నందనుఁడు చేయఁ బోవు సర్పయాగ దుర్వార్త.

తక్ష—అనగా నాకర్థము కాలేదు.

నార—అర్థము కాలేదా? అట్లయిన సాకల్యముగ నాలింపుము.

గీ॥ నీవు తనతండ్రిని హరించినా వటన్న
వ్యాజమునఁ దత్సుతుఁడు జనమేజయుండు
సకలసర్పాహుతి యొసఁగ్ను సర్పయాగ
మొకటి సేసెనుఁ బగదీర నూహఁజేసి ౨౨

తక్ష—(భయముతో) మహాత్మా! సర్పవంశంబున కిది యేమి విలయకాలము? నేటితో నురగలోకము నామరూపశేషమై పోవలసినదియేనా? ఇందులకు రక్షణోపాయమేమియును లేదా!

నార—ఓ వెఱ్ఱివాఁడా! సర్పవంశ నాశనమునకుఁ గారణమగు నీ వేల చింతనందెదవు? ఈ మహోపద్రవంబున సర్పకులము కెల్లను ఘోర నాశనము తప్పదు. అందుచేత, నీ వందరితోఁ బాటుగా నశింపక, స్వప్రాణరక్షణమార్గము జూచుకొనుట లెస్స.

తక్ష—మునీంద్రా! నాకింక నెట్టి రక్షణోపాయముగలదు? నాకేమియుం దోఁచుటలేదు. తద్విధానంబును సయితము తమరే యుపదేశింపఁగర్తలు.

నార—తక్షకా! భీతిల్లకుము. సర్పయాగంబులను నరులు సహజముగా దేవేంద్రుని ప్రీతికొఱకై యాచరింతురు. ఇప్పుడు నీవు స్వర్గంబున కరిగి దేవేంద్రుని చింతామణిపీఠంబునకుఁ జుట్టుకొనియుండుము. యాగంబులందు నరులు దేవేంద్రున కపకారం బొనరింపఁ దలఁపరు; కావున తన్మూలమున నీప్రాణములు రక్షింపఁబడును.

తక్ష—బ్రహ్మమానసపుత్రా! మీయుపకృతికిని యుక్తికిని మీకనేక వందనముల నొనరించుటకన్న నేనేమియుం జేయలేను. నేను స్వర్గంబున కరగెదను; సెలవిండు.

నార — మంచిది. నీకు శుభమగుఁగాక! పోయిరమ్ము.

(అనుబంధము 21.) (ఇరువురు నిష్క్రమణము)

[పటపరివర్తనము.]

రంగము 8 — జనమేజయుని సర్పయాగశాల.

(ప్రవేశము: — మునుల మధ్యమున యాగవేదికకడ జనమేజయుఁడు.)

శుక — (హోమముఁ జేయుచు) ఓ సర్వజగన్మిత్రా! అగ్నిహోత్రా!

గీ॥ స్వస్తి స్వాహాసతీనాథ! జాతవేద!
స్వస్తి సకలజగన్మిత్ర! యగ్నిహోత్ర!
సర్పవంశంబు సర్వంబు సంతరించి
భీమ భవదగ్నికీలల వేల్పుమయ్య!

(యాగము చేయఁగా, అనేక సర్పము లందు వచ్చిపడి యాహుతియగును.)

జన — శుకమునీంద్రా! సర్వసర్పసంహారమైనది; కాని తక్షకుఁడు మాత్రము రాకున్నవాఁడు; కారణ మేమియోకదా!

నార — జనమేజయా! తక్షకుఁ డింద్రుని సింహాసనముపైఁ జుట్టుకొని యున్నాఁడు. ఇంద్రుఁ డాతని కభయదానంబు నొసంగెను.

జన — ఏమేమీ! మాకుఁ బ్రపితామహుండయ్యు, నింద్రుఁడు మా శత్రువున కుపకారముసేయునే? మునీంద్రులారా! దేవేంద్రుఁ డు సహితము మాకిప్పుడు తక్షకునితోపాటుగా శత్రువమానుఁడే! కావున నాతని క్షమింపవలదు.

చ॥ ప్రకటముగాఁగ నాజనకు ప్రాణముఁ దీసినయట్టి దుష్టత
క్షకునకు మేలుచేసెనుగా యమరేంద్రుఁడు వైరబుద్ధిచే?
శుకముఖమౌనులార! బలసూదను పీఠముతోడఁ దక్షకుం
డీక సవనాగ్నియందు నశియించెను మార్గముఁజూడరే దయన్.

మునులు — (సమంత్రకహోమము చేయుదురు.)

శుక—సహేంద్రతక్షకాయ స్వాహా!

[ఆకాశమున నింద్రుఁడు తక్షకుఁడు చుట్టుకొనిన చింతామణీ పీఠముతోఁ దిరుగుచుండును.]

ఇంద్రు—హా! నారాయణా! రక్షింపుము! రక్షింపుము!!

[శ్రీమహావిష్ణువు ప్రత్యక్షము.]

విష్ణు—జనమేజయా! శాంతింపుము; శాంతింపుము. నీతండ్రి పుణ్యలోకంబున కరిగెను. నిష్కారణంబుగ నిరపరాధి యగు నింద్రుని వధింపకుము. మహేంద్రా! నీవిఁక తక్షకునితోఁగలిసి నిర్భయుండవై యరుగుము.

జన—మహానుభావా! శ్రీమన్నారాయణా! ఇంద్రతక్షకులకారణంబుననే మాకు దుర్లభం బగు యుష్మద్దర్శనమహాభాగ్యము గలిగెను. మాజన్మంబులు తరించెను. మీయాజ్ఞను శిరసా వహించితిమి.

విష్ణు—జనమేజయా! నీకు శుభం బగుఁగాక!

(అందఱును విష్ణువునకు నమస్కరింతురు.)

(అనుబంధము 9.)

[పటపరివర్తనము]

శ్రీమహాభక్తవిజయ నాటకమునందు

"పరీక్షిత్తు" అను ద్వితీయాంకము

సంపూర్ణము.



# హెచ్చరిక.

"బెజవాడ శ్రీ సరస్వతీమండలివారు" తప్ప తదితరులు, మావ్రాతమూలకమగు అధికారమును పొందక, ఏనటకులుగాని, ఈ నాటకమును ప్రదర్శించినయెడల, మేము జరుపబోవు సివిలు క్రిమినలు చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా బహిరంగపరుపనైనది.

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు,

సరస్వతీబుక్‌డిపో, బెజవాడ.

శ్రీ

మహాభక్తవిజయము.

తృతీయాంకము.

# కుచేలోపాఖ్యానము.

# ఇందలి పాత్రలు.

## పురుషులు

1 కుచేలుఁడు

2 శ్రీకృష్ణుఁడు

3 జయుఁడు

4 విజయుఁడు

## స్త్రీలు

1 రుక్మిణి

2 సత్యభామ

3 మిత్రవింద

4 జాంబవతి

5 కాళింది

6 లక్షణ

7 నాగ్నజితి

8 భద్రి





# శ్రీ మహాభక్త విజయము.

త్రృ తీ యాం క ము.

## కు చే లో పా ఖ్యా న ము.

కుచే— (అనుబంధము 23)

కరంధామా! భవబంధమోచనా! సంసారతారణా! నారాయణా! నిష్కాముఁడనగు నాకీసంసార బంధము నేల తగిలించితివి? స్వామీ! ఐశ్వర్యములఁ గోర లేదు. అనుభవంబుల నాకాంక్షింప లేదు. ధనధాన్యకనకవస్తువాహనంబుల దరిఁజేర్పఁ దలంప లేదు. అణిమాదివిభూతుల నాకాంక్షింప లేదు; తుదకు భోగంబులన్నిటికిని నీవే యని, నిరాకాంక్షం బూని, మోక్షమును సయితము నిన్నర్థింపక, తీయని నీపాదపద్మమకరంద రసపానమున మత్తుఁడనై జగంబును మఱచి, సర్వేశా! చిదానందకందళితుఁడనై యున్నానే? నే నేమిపాపము చేసితి నని నాకీదారాపుత్రు లనియెడు యమకింకరులను వెంటఁదగిలించితివి? ఒకఁడు గాఁడు; ఇద్దఱుగారు. ఇరువదియొక్క సంతానమే! కృష్ణా! ఇది నీయనుగ్రహంబని సంతోషింతునా! ఆగ్రహమని సంతపింతునా! ఫలములను కందమూలములను భుజించుట సయితము జీవహింసాకరంబు లని తలంచి, భూతదయను మానసంబున నెలకొల్పి, నేలరాలిన నివ్వరిధాన్యములను పిడికెఁ జేరి యాధాన్యంబుతోడ నగు గంజివలన, నిరువదిముగ్గురము జీవం

చుచుంటిమే! శ్రీకృష్ణా! ఇట్టి నాకా, నీ వీకష్టపరంపరలనుఁ గల్పించుట! స్నానసంధ్యాద్యనుష్ఠానంబులను మాని, యీమహారణ్యంబులం జడి పరిదేవనంబు సలుపుచుంటినే! శ్రీకృష్ణా! ఇన్నికష్టంబుల నంది నీసాన్నిధ్యమునకు వచ్చినను నీవు నాయందు కారుణ్యముం జూపుదువో, కాఠిన్యముం జూపుదువో? మహారాజాధిరాజులకుఁగూడ నలభ్యమగు నీదర్శనంబు నా కెట్లగుచు? (యోజించి) ఏమి నా వెఱ్ఱి?

మ॥ కలలోనం దను మున్నెఱుంగని మహానిష్ఠాత్ముఁడైనట్టి దు
ర్బలుఁ డాపత్సముదాయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁప న్నంతన మెచ్చి యా శ్రీహరుఁడై తన్నేన నిచ్చున్; ముని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్?

శ్రీకృష్ణుండు, నా బాల్యమిత్రుండుగదా! "కుచేలా! కుచేలా"యని, నిండారుమనంబున నన్నుఁ బిలుచుచు, తొల్లి సాందీపునియొద్ద నేఁజదివిననాఁడు మన్నించినవాత్సల్యంబు నాభక్తప్రియుండు మఱచునే? కావున నే నింక శ్రీకృష్ణ సాన్నిధ్యమునకై ద్వారకాపురంబునకు నిస్సంశయమానసంబున నరిగెదఁగాక.

(అనుబంధము 24) (నిష్క్రమణము)

[పటపరివర్తనము]

---

రంగము 2 — ద్వారకాపుర సింహద్వారము.

(జయవిజయులు ద్వారరక్షణ మొనర్చుచుండ కుచేలుఁడు ప్రవేశము)

కుచే— (అనుబంధము 24)

అయ్యలారా! శ్రీగోపాల కృష్ణదేవుని మందిరంబునకు మార్గ మిదియేకదా!

ద్వార 1—మార్గము మాత్రమిదియే కాని, నీవంటి నిరుపేదవారలకు మాత్రము కాదు.

కుచే—మహాత్ములారా! అతఁడు నాబాల్యమిత్రుఁడే! నా నిరుపేదరికమును గణించునా?

ద్వార 2—పారుఁడా? ఏమి నీ పరిహాసప్రసంగము? అస్థిచర్మావశేషుఁడవై, ప్రాణము లీకళేబరమునుండి నేఁడో రేపో వెడలిపోవ సిద్ధము సహస్రశకలములైన జీర్ణచేలము నొక దానిని ధరించిన నీవా కృష్ణదేవుని బాల్యమిత్రుఁడవు? హేహేహేహే!

(ఇద్దరును నవ్వుదురు.)

కుచే— ద్వారపాలకులారా! నేను పరిహాసవచనముల నాడువాఁడను గాను. నన్ను కుచేలుఁ డందురు. యాదవసార్వభౌముఁడగు శ్రీకృష్ణుఁడు నిక్కముగా నాబాల్యమిత్రుఁడు! చిన్ననాఁడే నందకుమారుఁడు బృందావనమునఁ బెఱిగినప్పుడు, సాందీపునియొద్దనే మిరువురము చదువుకొంటిమి! నాఁటిదయాపరిపూర్ణత నా దేవదేవుఁడు నేఁడును మఱువఁడు. కావున నారాక నెఱిఁగించితిరేని నామహాత్ముఁడు నన్నాదరింపక పోఁడు.

ద్వార 1—ఓ వెఱ్ఱిబాపఁడా! ఏటికి నీకీవిభ్రాంతి! నీకన్నను మొగమోటముగలవారు రాజాధిరాజులు వేనవేలు, దుర్లభం బగు నాభగవంతుని శుభదర్శనము లభింపక ద్వారదేశములం బడి, ప్రతీక్షించుచు, ననేకవత్సరములనుండియు పడిగాపులు పడియున్నారు. ఇఁక నీకా దర్శనంబగుట? పొమ్ము పొమ్మవలకు.

ద్వార 2—ఇచ్చటికి శ్రీకృష్ణదర్శనమునకై వచ్చువారందఱును నిటులే ఏమేమియో లేనిపోని బాదరాయణసంబంధములను గల్పించుకొని వచ్చుచుందురు. తిరుగలేక మాకాళ్ళు కదుములుగట్టుచున్నవి. అందును, పిశాచమువంటి వికృతాకారముఁ గలిగి దగ్గఱకు వచ్చుటకునయినను రోఁతఁగల్గించు నీ సందేశమునా మేము కృష్ణున కెఱిఁగించుట? పొమ్ము; పొమ్ము. కృష్ణుఁడు లేఁడు; దర్శనము లేదు.

కుచే—అయ్యయ్యో! నారాకనైన నాదేవున కెఱిఁగింపరా! ఆవల నాయదృష్ట మెటులుండునో!

ద్వార 1.—ఏటికయ్యా! మాతో వాదించెదవు? బ్రాహ్మణార్థములు చేసికొని బ్రదుకుము పొమ్ము.

ద్వార 2.—లేదా! పీనుఁగులనయిన మోసికొని బ్రదుకుము.

ద్వార1 —ఇతఁడే యొకపీనుఁగై యుండఁగా నితఁడు పీన్గుల నేమి మోయ గలఁడు? హేహేహేహే.

(ఇద్దఱును నవ్వుదురు.)

కుచే—కటకటా! నాయాశాబీజ మణఁగిపోయెనా? శ్రీకృష్ణా! ఆర్తశరణ్యా! నా మొరాలకింపవా? దేవా! నాప్రాప్త మింతేనా? ఆఁడుదానిమాటలు విని యుభయభ్రష్టత నందితిని. ఎంత వెకలినై వికలతనొంతిని! కృష్ణా! భక్తవరదా! దారిద్ర్యము నిచ్చినను నీవే! ధనమిచ్చినను నీవే! ఈమర్మము నెఱుంగ లేక ధనాశాపరిపూరితాంతరంగుఁడనై వచ్చినందుల, కాత్మజ్ఞానంబును గలిగించుటకా నాకీపరాభవమును గల్పించితివి? కానిమ్ము; ఏమిఘటిల్లినను నీభజనంబునుమాత్రము మానను. రక్షించినను నీవే! శిక్షించినను నీవే! (అనుబంధము 25)

(ధ్యానమున పరవశుఁడై మూర్ఛిల్లును)

ద్వార 1—విజయా! చూచితివే! ఈతఁడు భగవద్ధ్యానమున మునిఁగి, యెట్లు పరవశుఁడయ్యెనో! ఇంతవఱకు కృష్ణదర్శనార్థ మిటకు వచ్చిన వారందఱును, డంబగులనే ప్రకటించుచువచ్చిరిగాని యింతటినిశ్చలభక్తిపారవశ్యముం జూపరైరి! ఇతఁడెవ్వఁడో భక్తశిఖామణియై యుండఁబోలు! తప్పక మన మీతని సందేశమును భగవంతున కెఱిఁగించితీరవలసినదియే!

ద్వార 2—ఔను. ఏపుట్టలో నేపాముండునో. నీవు పోయి విన్నవించిరమ్ము!

ద్వార 1—(నిష్క్రమణము)

కుచే—(స్వగతము) హా! భక్తపరాధీనా! నీ దాసావనబిరుదమును సార్థకముఁ జేసికొనవా?

చ॥ వరదుఁడు సాధుభక్తజన వత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా
వరుఁడు;దయాపయోధి;భగవంతుఁడు;కృష్ణుఁడు; ద్వారకాస్థలీ
పురమున యాదవప్రకరముల్ భజియింపఁగనున్నవాఁడు నే
నరిగిన నాదరించు నని, యాశ వహించితి; ద్వారకాగతీ!

[ద్వార 1 - ప్రవేశము.]

ద్వార 1—విజయా! విజయా! మహోపచారము జరిగినది.

ద్వార 2—జయా! ఏమిజరిగినది?

ద్వార 1—కుచేలనామము, చెవినిఁబడినంతనే, దేవతలకైన దర్శనము నీయ ననుమానించు భగవంతుఁడు సంభ్రమముతో లేచి, వేగముగఁ దోడ్తెమ్మని యానతిచ్చెను.

కుచే—ఆహాహా! శ్రీమన్నారాయణా! నీ కనుగ్రహ మింతసేపటికిఁ గలిగెనా?

1 ద్వార... ⎫ మహాత్మా! విజయము సేయుము; మూఢులమగు మా
2 ద్వార... ⎭ యపరాధములను మన్నింపుము. (అనుబంధము 26)

[పటపరివర్తనము.]

రంగము 3. శ్రీకృష్ణాంతఃపురము.

[ప్రవేశము: అష్టభార్యాసమేతుఁడగు శ్రీకృష్ణుఁడు.]

భార్యలు— (అనుబంధము 27)

కృష్ణు—మానినులారా! నేఁడు నామిత్రుఁడగు కుచేలుఁ డిందువచ్చుటచే, నాకు పర్వదినంబో యని తోఁచుచున్నది. చిరకాలంబునకు దర్శనం బగుటచే నామిత్రునకు విశేషసన్మాన మొనరింపవలయును. మీరందఱును నాతోపాటుగ నాభక్తాగ్రేసరు నర్చించి ధన్యతం గాంచుఁడు.

అందఱు—భాగ్యము.

[కుచేలుఁడు ప్రవేశము.]

కుచే— (అనుబంధము 28.)

కృష్ణ—(లేచి యెదురుగా సరిగి, కుచేలుని కౌగలించుకొని) ఆహాహా! ఏమి నాభాగ్యము! నా బాల్యమిత్రుఁడగు కుచేలుఁడా! ఎన్నినాళ్లకు జ్ఞప్తికి వచ్చితివి! ఎన్నినాళ్లకు జ్ఞప్తికి వచ్చితివి!

కుచే—(చేతులు జోడించి) (అనుబంధము 29)

—దండకము—

శ్రీకృష్ణ శ్రీవాసుదేవా! నమో సుప్రభావా! నమో దివ్యభావా! నమో యాదిదేవా! నమో శాంతరూపాయ! విచ్ఛిన్నపాపాయ! సంఛిన్నతాపాయ! పరిచ్ఛిన్నకోపాయ! రాజత్కలాపాయ! భానుస్వరూపాయ! శాంతాయ! దాంతాయనంతాయ-సంతాపితాశేష పాపాసురానీక శీర్షాయ-గీర్వాణసంరక్షితానూనరూపాయ-హుంకార! యా పాకాయ-ధీరాయ-వీరాయ-లక్ష్మీనివాస పరిశాంతానమానార్ద్రవత్సాయ-నిక్షిప్తదానప్రకాండ ప్రభావాంతరీభూత హృత్సత్క-జలోలాయ! స్వామీ! నమస్తే-నమస్తే-నమః.

(పరవశుఁడై కృష్ణసన్నిధిని మూర్ఛిల్లును.)

కృష్ణ—ఆహా! ఇది యేమి యీ భక్తి! ఏమి యీ పారవశ్యము! నా మిత్రుఁడింతటి భక్తశిఖామణి యగునే? ఓహో! మూర్ఛిల్లియున్నాఁడే! ఇంతకన్న నా హృదయమునకు బ్రహ్మానందముం గూర్చు పదార్థ మీయనంతకోటి బ్రహ్మాండములం దెందును లేదు.

గీ॥ ఘోరసంసార సాగరోత్తారకంబు
ధీయుతజ్ఞాన యోగి హృద్గేయవస్తు
వైన, నిజభక్తి నీక్షించి యువశలీల
నెలమి సల్పుదు నానందనృత్య మేను.

(అనుబంధము 30)

సుచే— (లేచి) జగన్నాయకా! నీదర్శనంబున బ్రహ్మానంద పార
వశ్యము గలిగెను. ఇంక నాకీజన్మమునఁ జాలును. మఱల భవ
బంధంబులఁ బడి, చెడి, దండధర దారుణ కీలికీలికాసమూహా
తాపంబులఁ బరితాపంబు నొందఁజాల! నారాయణా! నన్ను
నీలోఁ గలుపుకొనుము.

కృష్ణు—మిత్త్రమా! ఏటికిట్లు జాలిమాట లాడెదవు? నేను బాల్యసఖుం
డనగు నీకృష్ణుండను గానా? నాకన్న, కులంబున, వయసున,
బుద్ధిని బెద్దవై, నన్ను పెద్ద సేయఁదగునే? ఈమణిపీఠంబునం
దుపవిష్టుండవు గమ్ము; నీపాదంబులను నాకందిమ్ము. వా
నిం గడిగి తత్పాదోదకంబును శిరంబునం దాల్చి, కృతార్థుండ
నగుదును. రుక్మిణీ! జలంబు లందిమ్ము. (రుక్మిణి జలంబులు
పోయుచుండ కాళ్లుగడిగి శిరమునం జల్లుకొనును) సత్యా! చందన
మేది?........(సత్యభామ చందనము నందీయ శరీరమున న
లంది)......జాంబవతీ! పుష్పహారము లేవి?...(జాంబవతియం
దీయఁగా కంఠమున వైచి)......మిత్త్రవిందా! కాళిందీ! మీరు
చామరంబులను వీచుఁడు......(వీతురు). లక్షణా! సువర్ణవి
కార భాసురంబగు ఛత్త్రంబును నీవు కేల ధరింపుము......
(లక్షణ యట్లు చేయును)...... నేను నామిత్త్రుని గమనాయా
సంబు శమింప, పాదమర్దనంబు గావింతును.(పాదములొత్తును).

సుచే—కృష్ణా! మిత్త్రుల మనుమాట యట్లుండనిమ్ము! నేను నీదాసుఁ
డనే! నీ కిట్లు సేయఁదగునా?

కృష్ణు—మిత్త్రమా! నీవు దాసుండవైనచో, నేను దాసానుదాసుండ
నగుట మఱచితివా?

సుచే—అట్లయిన, నీయభీష్టమును నే నాటంకపఱుపను.

రుక్మి—(స్వగతము) ఆహాహా! ఏమి యీకుచేలుని భాగ్యము!

ఉ॥ ఏమితపంబుఁ జేసెనొకొ! యీధరణీదివిజోత్తముండు; తొల్
బాముస; యోగినిస్పృహమానస్యకుఁడై తనరారు, నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించియున్నవాఁ
డీమహనీయమూర్తి; కినయే మునిపుంగవు లెంతవారలుఁ?

కృష్ణ—మిత్రమా! కుచేలా! మున్ను మనము సాందీపునియొద్ద నఖిల విద్యారహస్యముల నెఱింగి యరమరిక లేక, సంచరించిన నాఁటి వృత్తాంతములు జ్ఞప్తియున్నవా?

క॥ ఎఱుఁగుదువె? మనము గురుమం
దిరమున వసియించి, యతఁడు దెలుపఁగ వరుసన్
ఎఱుఁగఁగ వలసినయర్థము
లెఱిఁగి పరిజ్ఞానమహిమ లెఱుఁగుట యెల్లన్?

కుచే—దేవా! నీవు లీలామానుషుండవై లోకంబుకొఱకు, గురు స్వీకారము చేసితివే కాని, జగద్గురుండ వగు నీకు గురుం డెవ్వఁడు?

క॥ గురుమతిఁ దలఁపఁగఁ ద్రిజగ
ద్గురుఁడ వనందగిన నీకు గురుఁడనఁగా, నొం
డొరుఁ డెవ్వఁ డింతయును, నీ
కరయంగ విడంబనంబ యగుఁగాదె హరీ!

కృష్ణ—దానినట్లుండనిమ్ము; మిత్రమా! చిర కాలమునకు నన్నుఁజూడ వచ్చితివి! నా కేమి తెచ్చితివి?

కుచే—కృష్ణా! సకలప్రపంచముల కాహారము నిచ్చి పోషింపఁగల్గి భువనంబు లెల్ల నిమిడియున్న బొజ్జఁగల నీ కెవ్వఁ డేమి యీయఁగలవాఁడు?

కృష్ణ—మిత్రమా! అట్లుగాదు.

క॥ దళమైనఁ, బుష్పమైనను,
ఫలమైనను, సలిలమైనఁ బాయనిభక్తిం
గొలిచినజను లర్పించిన
నెలమిఁ రుచిరాన్నముఁగనె నే భావింతున్.

కుచే—(స్వగతము) కటకటా! నేనేమిచేయుదు! ఈమహదైశ్వర్యము లేమి! నేఁదెచ్చిన పిడికెడటుకు లేమి? ఈ చిపిటంబుల నీ మహాత్మున కెట్లర్పింతును?

కృష్ణ—మిత్రమా! మాటాడవేమి? నాకొఱకేమియుం దేలేదా! ఏదీ! చూడనిమ్ము. (చెంగువెదకి) ఆహాహా! ఏమి నాతో పరిహాసము చేయుచుంటివా? ఈమూటయేమి? నాకెద్దియో యుపహారముం దెచ్చి దాచుకొంటివా? (విప్పి) ఇఁక నేమి! నాకత్యంత ప్రియంబులగు నటుకులు! నామిత్రునిచేతి పదార్థము నెన్ని నాళ్ళకు భుజించు నదృష్టము గలిగెను! (2 పిడికెళ్లుతినును.)

రుక్మి—(కృష్ణుని చేయిపట్టుకొని) నాథా! ఇఁక తినుట చాలును!

కృష్ణ—దేవీ! ఇదియేమి! నన్ను వారించెదవు?

రుక్మి—"దాసానుదాసుండనుగదా" యని పలికితిరి; మీ రిదివఱకే యీ మహాత్మునకు నగము దాసులైతిరి. ఈ యటుకులం దిని పూర్ణముగ దాసులై పోవఁ దలఁచితిరా?

కృష్ణ—అయిన నన్నేమి చేయుమందువు? నే నెప్పటికిని దాసానుదాసుండనే!

రుక్మి—మీరుచేయుదాస్యమును మీ యర్థాంగినగు నేనును జేయుదును. మీరు దాసులైనచో నేను దాసి నగుదును. మిగిలిన పిడికెడును నాభాగము.

గీ॥ బలిని యాచించి, ఋణపడి, వానియింట,
శాశ్వతంబుగ దాస్యము సలిపినట్లె
మూఁడుచేరల యటుకుల మూలముగను,
చేయుదము దాస్య మింకఁ గుచేలునింట.

కృష్ణ—అట్లయిన నీకే వదలితిని.

(రుక్మిణీకృష్ణులు అటుకులు తినుచుందురు.)

అందఱు—(అనుబంధము 27)

[పటపరివర్తనము.]

---

శ్రీమహాభక్తవిజయము నందు
"కుచేలోపాఖ్యానము" అను తృతీయాంకము
సంపూర్ణము.

# భోజకాళిదాసు.

(గ్రంథకర్త—సోమరాజు రామానుజరావుగారు)

సరస్వత్యపరావతారమని పేర్గాంచిన మహాకవి కాళిదాసుయొక్కయు, భూతలమున నవతరించిన చతురాననుఁడను పేరందిన భోజరాజుయొక్కయు దివ్యచారిత్రములు రెండును ఒకే కథాసూత్రమునఁ గూర్పఁబడి ప్రదర్శనానుకూలమగు నాటకరూపమున రచింపఁబడి, ఆంధ్రసారస్వతమున కొక దివ్యమణిభూషం గూర్చిన రూపకము! కాళిదాసు పూర్వవృత్తాంతము, ఎఱుకుల గ్రామ్యభాషావినోదము, శారద సాధ్వీత్వము, కాళిగాఁడు కాళికానుగ్రహమున కాళిదాసుగా మారుట, శ్యామలాదండకాదులు మహాద్భుతముగ వర్ణింపఁబడినవి. కాళిదాసు భోజాస్థానమునగల కుకవులను నిర్జించి, అష్టదిగ్గజములం దగ్రతాంబూలము నందుట; పండితవాదములు, సమస్యాపూరణములు, కాళిదాస కృతశ్లోకములతోడను, గ్రంథకర్తచే భాషాంతరీకరింపఁబడిన పద్యములతోడను, విరాజిల్లుచున్నది. కాళిదాసు కేవలము కవిమాత్రుఁడే కాక మహామహిమసంపన్నుఁడై ప్రాతః స్మరణీయుఁడగుట స్థిరీకరింపఁబడినది. కాళిదాసుపై నీర్ష్యఁబూనిన ఇతరకవులు మహారాణితో నాతనికి దుష్టసంబంధమును కల్పించి రాజుచే కవిని పరాభవింపఁజేయుట, వేశ్యయగు విలాసవతి రాజ్యకాంక్షచే కాళిదాసును చంపుట, భోజరాజు ఆత్మహత్య చేసికొనుట, మఱల నిరువురు శారదాప్రభావమునఁ బునర్జీపితులగుటయు—రమ్యములగు చిత్రఘట్టములు. కంఠస్థము చేయఁదగిన పద్యములు, శ్లోకములు, అనేకములు గలవు! వెల రు 1—0—0.

శ్రీ

# మహాభక్తవిజయము.

## చతుర్థాంకము.



# మార్కండేయ.



# ఇందలి పాత్రలు.

## —♦ పురుషులు ♦—

1 యముఁడు

2 మార్కండేయుఁడు

3 నారదుఁడు

4 చిత్రగుప్తుఁడు

5 శంకరుఁడు

6 సోమయాజి

7 దీక్షితులు

8 పీర్ సాహెబ్

9 ఇద్దఱు యమభటులు

## —♦ స్త్రీ ♦—

1 నారాయణమ్మ.





# శ్రీమహాభక్తవిజయము.

చతుర్థాంకము.

## మార్కండేయ.

రంగము 1. - యమలోక పరిసరము.

(ప్రవేశము: - యమభటునితో - పీరుసాహెబు.)

పీరు— (అనుబంధము 31.)

అరే హల్లా!- మేము, బడీజంగ్ మే- లడాయీ సేసీ, ఫరారీ కాక మర్గయీ అవినాం! - అదీ సబబ్ సేతా, మకీ, హవ్వల్ రఖం రంబా సంబోగం దొర్కుతాదీ బోలేతో, మదీదిల్ మే - సాలా సాలా, ఖులాసా, సేస్కున్నాం- అరేబాబూ! మాకీ కఫరీస్తాక్ కీ, తీస్కొయెల్లేదాన్కి బద్లాయించీ, యీ ఫాదూయమధ మ్మాలోకాన్కి తెచ్చీనార్? మాదీఘూషారం, మాకీ-ఛోడ్తానె? రంబా ధోర్కుతాదీ హంటే లడాయీలో సచ్చీనాంగానీ- యీడ్కి తెస్తారూ తెలిస్తే - మేం - జంగ్ మే యొద్కూవ స్తాం? - అరే! యమాలూసాహేబ్? మాకీ- యీడకూ హెం దీక్ తెచ్చుండావ్ జే?

భటు—అల్లరిచెయ్యక, నడు- నడు. నీవు, చాల పాపాత్ముడివి. ముందుగా నిన్ను మాప్రభువుగారు విచారిస్తారు. ఆవెనుక రంభా సంభోగం. ఇప్పుడు కాదు; నడు - నడు.

పీరు—అరే! మేం, యెలాగా, పాపం సేసినాంరా? మేము సాలా సాలా, పున్నెం సేస్కున్నాం! బోల్తాం సునో - పహిలే!

సీ॥ సీల్ వేణి బీబీకి, నీఖా సాసాయించి
లచ్చరూపాయీలు ఇచ్చినాము;
గానాబజానామె, ఖన్నాగి సానీకి
సూసి, బక్షీసు లిచ్చేసినాము;
జల్సచేసేదాన్కి సందాల నిమ్మంటె
పెద్దమొత్తాలు గుప్పేసినాము
దారూదుకాణం మదారుసాయేబుకు
సంచులు సంచు లిప్పించినాము;
గీ॥ మొహారమందు పెద్దసవారి మోసినాము;
ఉరుసులో నిప్పుగుండాల నురికినాము;
ఇంత పుణ్యం మెము కమాయించినాము;
యెమలుసాయెబూ! పాపమింకేది మాకు?

భటు—నీవు గోమాంసమును భక్షించినావు; సురాపానము చేసినావు; స్త్రీలను చెఱచినావు; అమితమైన పాపము చేసినావు. వీని కన్నిటికిని మొదట ఫల మనుభవించినంగాని -యుద్ధమునచచ్చి నందులకు గల్గు రంభాసంభోగము లభింపదు! త్వరగా నడువు!

పీరు—హరేహల్లా! ఘోష్ఖానా- దారూపీనా - ఔరత్ జానా - ప సాబీ- పాపంఅనీ, మాకూ మాలుంకాలేదూ హండీ. యము లూసాయబూ!- మాకీ జాన్ బక్షిస్ యిప్పించండీ బాబూ! మీాకీ పామ్కీ పడ్తాం- సలాంసేస్తాం.

భటు—మా యమధర్మరాజుగారితో చెప్పుకొని, ఏడ్తువుగాని, పదపద.

పీరు—అరేబాబూ! రంబాసంభోగాన్కి-ఆశాకడీ, జంగ్ మే సచ్చినాం- రంబా చల్గయీా- నరకం మిల్గయీా.

(ఏడ్చుచు- భటునితో, నిష్క్రమించును.)

(తరువాత—ఒక సోమయాజులు భటునితో ప్రవేశము.)

సోమ—"హరేరామ హరేరామ-రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ-కృష్ణకృష్ణ హరేహరే."

ఇదేమిట్రా! నీ యిల్లు నల్లకాడుగాను, నానాశ్రమలూ పడి, రాత్రనక, పగలనక-అడివనక-పుట్టనక-తిరిగి, అష్ట కష్టాలూపడి, రంభాసంభోగంకోసం ఆశపడి, యజ్ఞంచేసి ఏడ్చిన ముండావాణ్ణి నన్ను యమలోకానికి, తీసుకొచ్చావేమిటిరా? ఆ తొత్తుకూతురు రంభెక్కడుందో నా కళ్ళకైనా చూపించరా నాయనా! చూచైనా సంతోషపడతానూ. నిన్నే నోయ్! ఓ యమదూతయ్యా! నిన్నే! బెల్లంకొట్టిన రాయి లాగ, అల్లా చూస్తావేమిషిరా?

భటు—సోమయాజులుగారూ! యజ్ఞంచేసిన పుణ్యంతప్ప మీరు చేసిన మిగతీవన్ని పాపకార్యాలే! మీరు పాపఫలం చాలా అనుభవించవలసి వున్నారు. అందుకొఱకై ముందుగా యిక్కడికి తెచ్చాం! అయితే, ముందుగా పుణ్యం అనుభవించి, తరువాత పాపం అనుభవిస్తామని మీరు వొప్పుకున్నారు గనుక, ముందుగా రంభాసౌఖ్యం అనుభవించవొచ్చును. తొందఱపడకండి, అదిగో వస్తూంది రంభ—

సోమ—ఏదీ! ఏది! నాయనా! ఆ రంభ, ఎల్లావుంఛుంది? ఎక్కడుంది? నిజంగా వొస్తూందా? పరిహాసాని కంటున్నావా?

(రంభప్రవేశము)

రంభ—ఏమండీ సోమయాజులుగారూ! ఎనభైయేళ్ళొచ్చి, మీకు రంభ కావలసివచ్చిందా?

సోమ—అదుగో! అదుగో! నా బంగారుచిలుక - నా పసిడిముద్ద-నా ముద్దుల మోహిని - ఎక్కడో మాట్లాడుతూంది! కొంచెం దృష్టి సరిగా పారదు. ఇది రంభేనా - నాయనా! ఆడదేకద! ఏదీ! ఏదీ!

రంభ—సోమయాజులుగారూ! సరిగా కనపడనివాడికి సానెందు కయ్యా! అందులో భూలోకపు భోగకాంతలు చాలక, యజ్ఞం చేసి చచ్చి, రంభకోసం వచ్చావా? సిగ్గులేదూ నీకు?

(అనుబంధము 32)

సోమ—హాహ్హాహాహ్హాహాహ్హాహాహ్హాహ్హా! నా చిలుకలకొలికీ! నా మెరుకలు కొటికీ! నా పెరుగుతోటకూర స్తంభా! రంభా! నీచీవాట్లు - చింతకాయపచ్చడిలో నంజుకున్న తద్దినపుగారెలకు మల్లే-ఎంతకమ్మగా ఉన్నాయే? ఆసి నీతల్లిసిగ తెఱగ! ఇన్నాళ్ళకు, నాజన్మ తరించిపోయిందనుకో! ఇదిగో! ఇదిగో! నేను, ముసలాణ్ణని, మొగం మాడుస్తున్నావా? వయస్సుమీఱిందని వల్లనంటున్నావా? తలనెఱిసిందని, తటపటాయిస్తున్నావా? ఎంత తెలివితక్కువదానవు! ఎంత తెలివితక్కువదానవు! పాతచింతకాయపచ్చడి పథ్యమని ఎఱగవూ? పుచ్చురేవలిచిన్ని పూజ్యమని ఎరగవూ? తొండకన్నా-ఊసరవిల్లి-తొంబైరెట్లు అందమైనదని ఎరగవూ? ముసిలాణ్ణా? ముసిలాణ్ణయితే, మోహం తగ్గిందనుకున్నావా? తల తెల్లబడితే తలపులు చల్లబడ్డవనుకొన్నావా?

రంభ—చాలుచాలు - నోరుమూసుకో! పగలంతా, శాస్త్రమనీ, సోమయాజులమనీ, పెద్దపెద్ద నీతులు చెపుతూ- రాత్రిపడగానే సంభావనడబ్బులు సానులపాదాలకు సమర్పించిన పాపంచాలదూ? యజ్ఞంపేరుమీద డబ్బుగణించి, ఏముండకో తగలబెట్టిన పాపం చాలదూ? సోమయాజులువై చచ్చినశుంఠవు. చచ్చి కూడా సానిసౌఖ్యం ఆసించి, పాపపుసంచులు మూటంగట్టుకోవడానికొచ్చావా? బ్రాహ్మణాధముండా?

సోమ—రంభా! బుట్టెడు చెప్పుదెబ్బలయినా, బూరెముక్కకు సమానం కావన్నారు పెద్దలు! నువ్వెన్నితిట్టినాసరే - పొడుంపట్టువంటి కమ్మటి ముద్దొక్కటి కటాక్షిస్తే చాలు!

(దీక్షితులు ప్రవేశము.)

దీక్షి—ఎవరయ్యా అక్కడ? - మీకెక్కడైనా రంభకనబడ్డదా? నేను యజ్ఞంచేసి చావడంచేత రంభాసంభోగంకోసం వచ్చాను. రంభ యిక్కడుంది వెళ్లమని యమధర్మరాజుగారు చెప్పారు! ఈజనంలో రంభవుందా?

సోమ—ఏమిరోయ్! దీక్షితులుభావా! నువ్వుకూడా చచ్చి స్వర్గవేశ్యాసంభోగానికొచ్చావంటరా?

దీక్షి—అదుగో! అదుగో! ఇహనేమీ? - మాసోమయాజులు బావకూడా ఇక్కడనే వున్నాడు! బావా! రంభను చూచావుటయ్యా?

సోమ—ఇదుగో! ఇదుగో! మీచెల్లెలు రంభ యిదేరా నాయనా! ఇదే!

దీక్షి—నాచెల్లెలేమిటి! నీమొహం - నీకే చెల్లెలవుతుంది? ఇంకా చెప్పవేం? రంభా! నీమీద మోహంచేత చచ్చిపోతున్నాను! భూలోకంలో యజ్ఞంచేసిన పుణ్యాత్ముణ్ణి - ఇంతకన్నా తగినభర్త నీకెక్కడాలభించదు. ఒక్కకౌగిలింత - ఏదీ? ఒక్కకౌగిలింత?

సోమ—వరేయ్! దీక్షితులూ! దాన్ని ముట్టుకున్నావంటే, కాళ్లు విరగ్గొడతాను! జాగ్రత్త!

దీక్షి—అరి ముసలిపీనుగా! నాకాళ్లే విరగ్గొడతావూ! దీక్షితులంటే ఏమనుకున్నావో! దిమ్మతిరిగి పోతుందనుకో!

సోమ—ఓరి అప్రాచ్యపు ముండావాడా! వరసా వావీ- ఎరక్కుండా దానికి సిద్ధమౌతావు! నీకున్నరోగం- మొదటినుంచీ ఇంతేకా! నేనెఱగను గనుకనా? యజ్ఞంచేసి నేను నీకన్నా మొదట చావడంచేత- రంభ నాకిదివరకే భార్యఅయిపోయింది. కనుక - నాబావమఱిది వైన నీకు చెల్లెలవుతుంది! నీకు వరస కాదు. రంభపేరైనా తలపెట్టడానికి నీకధికారంలేదు. తెలి

సిందా? అందుచేత- నీవు, ఊర్వసో- తిలోత్తమో- మఱోక వేశ్యను దేన్నో దేవుల్లాడుకో.

దీక్షి—ఏడ్చినావులే. - నాకంటే ముందువచ్చావని, నీగొప్పేమీ అక్కడ తగలబడలేదు. నీకు మల్లే- నేనూ యజ్ఞంచేసి చచ్చిన వాణ్ణే. - చిత్రగుప్తుడుగారు, నన్నిక్కడికి వెళ్ళమన్నారు. రంభ నీకే చెల్లెలవుతుంది. నాకు భార్య అవుతుంది. నోరు మూసికొని వెళ్లు.

సోమ—రంభ నీకు వరసకాదురా అంటేనూ, మళ్లీఅదేమాట.

దీక్షి—నీకే వరసకాదురా అంటే మళ్లీఅదేమాట.

సోమ—చెల్లెలిచేయి పడతావంటరా చెడిపెనాగన్నా!

సోద—సోదరిచేయి పడతావంటరా శుద్ధబుద్ధిహీనుడా!

రంభ—చాలాఅందంగావుంది - వరసతెగక చస్తున్న ఓవ్రాజమ్మల్లారా! మీలోమీరు ఏదో వొకటి ముందు తెగదెంపుకోండి! తరువాత- నాఅవసరముంటే, వస్తానులెండి! నేనింటికివెళ్లుతున్నాను.

సోమ—ఆఁ-ఆఁ-రంభా! వెళ్ళొద్దు-వెళ్ళొద్దు-నాతోడే. నువ్వు వాడికి చెల్లెలవు. నాకు భార్యవు. వరస తెగిపోయినట్టే. పేచీఏమీ లేదు. నా దెగ్గరికేరా.

దీక్షి—ఏడిచాడులే. వాడిమాట వినబోకు రంభా! నా దెగ్గఱకేరా. వాఁడు వట్టి పొడుంముక్కు పోలయ్య.

సోమ—రంభా! వీఁడికి మా వూళ్లో గౌరవం ఎంతమాత్రమూ లేదు. వట్టి పీనుగులరాయుడు. నీరుకాసుల సన్నాసి.

దీక్షి—నాసంగతెత్తావంటే, మర్యాద దక్కదు.

సోమ—నా సంగతెత్తావంటే, అంతకన్నా దక్కదు.

(వితంతువయగు, నారాయణమ్మ యమభటునితో ప్రవేశము)

నారా—(గ్రొమ్ము బాదుకొనుచు) అయ్యో నాదేవుఁడా. నాదేవుఁడా. నా నెత్తికి ముసుగు వేయించావా. నా బుఱ్ఱ మంగలాడిచేత

గొంతికోంచావా. నా తాడు నడిరేవులో తెంపించావా? నా దేవుఁడా. ఈ యముడు ముండాకొడుకులు నన్ను యమలోకాని కీడ్చుకొస్తూవుంటే, నువ్వు బోగందానితో సరసమాడుతున్నావా? నా బిడ్డలతండ్రి. నా దేవుఁడా! నా దేవుఁడా!

దీక్షి—అక్కయ్యోయ్. ఇదేమిటే. నువ్వూ చచ్చావా? ఇదుగో. చూశావా? బావ చేస్తున్న పాడుపని. ఇంత ముసలిముండావాఁడై చచ్చికూడా సానితో సరసమాడుతున్నాఁడు. అయ్యో నీ యిల్లు బంగారంగాను. కళ్ళయెదుట బావ వుండగానే బోడి ముసుగు వేసుకుని వెధవముండ వైనావేమిటే అక్కా?

నారా—మీ బావగారు చచ్చిపోయినారు గాదటాఁ. నాయనా. చావడంతోటే, నిగనిగలాడుతూ నేల కానుతూవుండే నా వెండ్రుకలు గొరిగించి, ముసుగు తగిలించి మూలను కూచోబెట్టారా నాయనా!

సోమ—ఓసిముండా! భూలోకంలో కటకట కటకట, నా యెముకలు కొరికిందిచాలక యమలోకానిక్కూడా నావెంటబడి చక్కా వొచ్చావా? మంచి సరసరమైన సమయంలో పానకంలో పుడకలాగ అడ్డమొచ్చావుగదే! భ్రష్టుముండా!

నారా—అయ్యో! అయ్యో! ఎన్ని తిట్లు తిడుతున్నాడో చూశావటాఁ! తమ్ముడూ! వీడినోరు పడిపోను. వీడిజిహ్వ వెనక్కులాగ. చచ్చికూడా నన్ను సాధిస్తున్నా డేమిటాఁ నాయనా! వీడు చావటంచేతనే, నేను విధవనైనానురా బాబూ!

సోమ—తిట్టకే. తిట్టకే. రంభ వింటూంది. నిన్ను బ్రతిమాలుకుంటాను. తిట్టకే!

భటు—ఇదుగో బోడెమ్మా! ఇక్కడ, నువ్వూ నీ మొగుడూ, చచ్చిన తర్వాతకూడా పోట్లాడుకోటానికి తీసికొనిరాలేదు. నీకు మా యమధర్మరాజుగారు శిక్ష విధిస్తారు నడు నడు.

నారా—ఉండరా, యమభటుఁడా! ఉండు. చచ్చినదానితోపని వచ్చినదాకా వుండవలసినదే.

సోమ—యమదూతయ్యా! ఈముండని తక్షణం లాక్కెళ్లు పానకం లో పుడకలాగ అడ్డమొచ్చింది. అప్రాచ్యపుముండ. బ్రతికున్నన్నాళ్ళూ పడదిట్టింది చాలక, చచ్చికూడా సాధిస్తూంది.

నారా—ఏమిటీ? నేను, పానకంలో పుడకలాగ, అడ్డమొచ్చానా? లేకపోతే, రంభతో లేకి సరసాలు వెలగబెడదా మనుకున్నావా? బ్రతికున్నప్పుడు నామాట పల్లెత్తయినా మీరి ఎఱుగుదువా? గడగడ లాడుతూ గడప్పైనా దాటావా? చచ్చిన తరువాత శౌర్య మొచ్చిందా? రంభని ముట్టుకొని చూడు- రాలి పోతాయో లేదో పళ్లు.

సోమ—వసేవ్! మంచిదానవుకాదూ! నన్ను తిట్టకే! రంభముందర తిట్టకే! నాపరువు పోతూందే!

నారా—ఊం- ఇదివర కొకపరువు ఏడిచిందిగనుక, ఇక పోతుం దని విచారమా!

(పీరుసాహెబు ప్రవేశము.)

పీరు—అరే! బొమ్మర్కె షైతాన్లూ! హెండ్కీ గడ్ బిడా సేస్తారూ బే! హారో!హారో!! మేం, లడాయీ మే, పచ్చీ- రంభాకోసం వచ్చాం. మాకీ పున్నెం పహిలే తినీ, పాపం ఆఖరీమే తింటాం అనీ, పెప్పాకున్నాం- అండ్కీ-పే తా, అభీ మాకీ, రంభాహూనా! రంభా కహాంగయీ! జల్దీ బోల్నా- లేకాపోతే, హాండర్కీ- మేం ఖతల్ చేస్తాం. మై బడీ లడాయ్ కర్నేవాలా సిపాయి హుం.

నారా—అయ్యో! అయ్యో!! వీడి మొహం ముండా! వీ డెవడమ్మా! తురకసాయెబూ మీది మీది కొస్తున్నాడూ, ......వరే! దూదేకులసాయెబూ! దూరంగావుండు!

పీరు—అరేహల్లా! ఈ బొమ్మర్కె యెథ్యాముండా లడ్డూవుండాలాగా, హెంతా బాగావుందిరా బాబూ! మాకీ రంబాగింబా మంగ్తా నై! ఈ బొమ్మర్కెముండాకీ తీస్కోనీ, మేం, ఫరారీ అవుతాం.

సోమ—ఇదేమిషిరో! దీక్షితులూ! వీడు మీ అక్కమీఁద విఱుచుకొని పడుతున్నాడు! కాస్త వాణ్ణి అదిలించనైనా అదిలించవేమీ! అల్లా గుడ్లువెళ్ళబెట్టుకుని చూస్తావేమి? నేనైతే నీకు లోకువా?

దీక్షి—ఏమీ? మొగుడుముండాకొడుకువు నువ్వెందుకు అదిలించలేవూ? అన్నముండాకొడుకును, నే నదలించాలీ?........ ఇదుగోనండోయ్! నవాబుగారూ! రంభ, అక్కడ నిలవబడి వుంది! ఇది రంభ కాదు! మా అక్కయ్య! రంభ దెగ్గిరికి వెళ్లండి!

పీరు—అరే! జారే జా! బొమ్మ్నాక్ సైతాన్ జా! "మాకీరంభా అక్కలేదూ మీఅక్కకావాలా" అనీ సెప్పాం లేదూరా?...... అగే! బోడెమ్మాగారూ! మాకీ, పీర్‌సాహెబ్ బహద్దర్ సెప్తారూ! మాదీ గడ్డంకీ ధాడీ, మూతీలో బీడీ, సేతీలో కాడీ సూసీ, సాలాసాలా, మందీ సాన్లా మాదీ మీదా రంగూహైనార్! మీకీకూడా, మాకీ, థోడా మెహర్బాన్ సెయ్యవాలా పార్థనా సేస్తాం.

(అనుబంధము 33)

నారా—అయ్యో! అయ్యో! భ్రష్టుముండావాఁడా! యమభటుడికన్నా ఎక్కువగా, నాకు నువ్వెక్కడ దాపురించావురా! ముట్టుకుంఛావా యేమిటి? దూరంగా వుండు! నీశృంగారం సురమండల మైనట్టే వుంది!

[చిత్రగుప్తుఁడు ప్రవేశము.]

చిత్ర—ఎవ రిక్కడ? గంద్రగోళంచేసేది! యమభటుఁడా! ఈపాపాత్ములంతా, వారిలో వారు హాస్యాలూ సరసాలూ పోట్లాటలూ ఆడుకొంటూవుంటే, నువ్వునోరుమూసుకుని, తెల్లపోయి వింటున్నావా? వీళ్ళనందర్నీ తక్షణం శిక్షాశుభవాలకోసరం, తీసికొని వెళ్లి సభలో హాజరుపెట్టు. రంభా! యజ్ఞంచేసిచచ్చిన యీ బ్రాహ్మణులకూ, యుద్ధంలోచచ్చిన, ఈ యవనుడికీ నీతో సుఖానుభవం పొందటాని కివ్వఁబడినకాలం అతిక్రమించిపోయింది! కనుక, నీ విఁక ఇక్కడ వుండనక్కఱలేదు,

వెళ్ళిపోవచ్చును.........ఓ పాపాత్ములారా! మీలో మీరు తగవులాడుకుంటూ, మీపుణ్యకాలం పాడుచేసుకున్నారు. ఇక పాప కాలం వొచ్చింది! యమభటుడివెంట కిక్కురమనకుండా నడవండి! భటుఁడా! తీసికొనివెళ్లు!

రంభ—భగవంతుడి దయచేత బ్రతికి బయటంబడ్డాను! ఓపాపులారా! రంభాసంభోగంకొఱకై మీరు పొందిన ఆశకు తగిన ఫలం కలిగింది! నెత్తిన గుడ్డలు వేసుకుని నడవండి!

భటు—ఊఁ-ఇఁక అందఱూ నడవండి.

(అనుబంధము 34)

(అందఱును నిష్క్రమింతురు)

[పటపరివర్తనము]

రంగము 2.— నారదుఁడు ప్రవేశము.

నార— (అనుబంధము 35.)

గీ॥ కమలభవుఁడు నన్ గలహాభోక్తగ సృజించి,
కలహభోజనములు నాకుఁ గడుపునిండ
నొసగఁ డాయెగదా యంచు విసిగియున్న
నాకుఁ గలహంబు లెటుల సంఘటిలు నిపుడు?

(యోచించి) భళీ! తోచక తోచక తుదకు ప్రశస్తమగు యోచన తోచినది. భూలోకంబునఁగల మృకండుఁడను ఋషిసత్తమునకు శంకరవరప్రసాదంబునఁ గల్గినమార్కండేయ కుమారునకు పదునాఱేండ్ల కాయుర్దాయము సమాప్తం బగునదిగా శంకరుఁ డానతిచ్చెను. అందులకు వ్యతిరేకముగ, భగవానుఁ డగు వసిష్ఠమహర్షియు, మత్పితృపాదుఁడగు చతురాననుఁడును బొరపాటుచేత నాబాలునిఁ జిరాయుష్మంతునిగా నాశీర్వదించియున్నారు. అందుచే నవిలంఘనీయము లగు తత్పూజ్యులయాశీర్వచనంబు లా కుమారభక్తశిఖామణిపట్ల

వరంబులై ప్రవర్తిల్లక మానవు. శమనుండీవృత్తాంతము నెఱుంగక తనవిధ్యుక్తధర్మప్రకారముగా మార్కండేయునకు షోడశవర్షంబులు నిండినంతనే తనదూతల నంపియో, వారికసాధ్యంబైనచోఁ దానరిగియో మార్కండేయుజీవహరణంబొనరింపఁ బ్రయత్నించును. అందులకు వసిష్ఠచతుర్ముఖుల దీవనలాటంకములై యాకుమారునిఁ జిరంజీవినిగా నొనరించును. భళీ! ఇది యొకచిత్రమైన నాటకమువలెనుండి కలహాభోక్తనగు నాకానందప్రదంబగును. నే నిప్పుడే శమననగరంబున కరిగి యమధర్మరాజునకు రోషముఁ బుట్టించి వచ్చెదను. ఇంతకన్న నానందకరమగు వృత్తాంతము నాకెందు లభించును?

సీ॥ సకలజీవనజీవన గ్రహణోత్తమశక్తి
దాలుకాడ నే సమర్థుఁడ నటంచు
నవనిలోఁగల సుకృతాత్ములు, దురితాత్ము
లందఱు నావశంబౌదు రంచు,
కడకతో వారికి గతులు జూపెడు ఘన
కార్యంబు నాయందె గల దటంచు,
పాపపుణ్యములు విభాగించి, ధర్మంబు
నడిపెడుధీశక్తి గల దటంచు,
పొంగి గర్వించు జముసకుఁ బూర్ణమైన
గర్వభంగము నొనరింపఁ గల్గునదను
వచ్చియున్నది, శంకరవరసముద్భ
వోత్తమ మృకండపుత్రకథోక్తివలన.

(అనుబంధము 36) (నిష్క్రమణము)

[పటపరివర్తనము]



## రంగము 3. — యమలోకము.

[ప్రవేశము : సుఖాసీనుఁడగు యముఁడును, లెక్కలు చూచుచుఁ జిత్రగుప్తుఁడును, మఱికొందఱు భటులును.]

యము—చిత్రగుప్తా! నేటిదినంబువఱకును గాలముచెల్లిన జీవకోటి నిందుఁ బట్టి తెచ్చుటకై భటుల నంపియుంటివా?

చిత్ర—దేవా! జీవులనిమిత్తమై మనభటులు కొందఱరిగియున్నారు. ఇప్పటి కిందుఁ గొనిరాఁబడిన పాపులకుఁ గారణశరీరములం గల్పించి శిక్షావిధానముల నెఱఁగించుటకై తమరాకకుఁ బ్రతీక్షించుచున్నాను.

యము—అట్లైన నింక జాగేల? సత్వరము ప్రవేశపెట్ట నానతిమ్ము.

చిత్ర—మహాభాగ్యము. భటులారా! పాపుల నొక్కనినొక్కనిగా ప్రభుసన్నిధానమునకుఁ గొనిరండు.

(భటులు ఒకపాపినిఁ గొనివత్తురు.)

యము—చిత్రగుప్తా! వీని కర్మఫలంబులను వివరింపుము.

చిత్ర—దేవా! వీఁడు మిక్కిలి లుబ్ధుఁడు. అనేకకోట్లధనము నన్యాయమార్గమున సంపాదించియుఁ, దాను తృప్తిగాఁ దిని యెఱుంగఁడు; ఒకరికిఁ బెట్టి యెఱుంగఁడు. బహుసాధుజనహింసాపరాయణుఁడు. తల్లిదండ్రుల కన్నముఁబెట్టక యేడ్పించినాఁడు. ధనలోభత్వమున భార్యను, కుమారునిఁ జంపినాఁడు.

యము—(ఆగ్రహముతో) ఓరీ! నీచలోభాత్ముఁడా! ఇంత పాపంబు సల్పి నీ వార్జించిన ధనమునం దొకగవ్వయైన నిప్పుడు నీవెంట వచ్చినదఁటరా! అజ్ఞానీ! సాధుహింసపరాయణా!

చ॥ విమలుల మోసగించి సిరు పేదల నోటను బుగ్గిగొట్టి వి
త్తముఁ బదిలక్షలం గడు నధర్మవిధంబున సేకరించి దా
నము నొనరింపలేకయు, ఘనంబుగఁ దాఁ దిన లేని లోభులక్
క్రమమున నక్కుముక్కుగలకాకులు పీకెడుశిక్ష శ్రేష్ఠమౌ.

భటులారా! వీనిం గొనిపోయి యాశిక్షను విధింపుఁడు.

పాపి—అయ్యో, బాబయ్యో బాబో! అంత పెద్ద శిక్ష వేస్తే బతకలేను బాబో! సంపాదించిన డబ్బంతా వెంటగట్టుకొని చస్తా ననుకున్నానుగాని, యిలాగౌతుం దనుకోలేదురో బాబో! నాయనా! యమభటుడు బాబూ! నీకో పదిరూపాయ లియ్యవలిసిం దని మాబుల్లోడికి చీటీరాసిస్తాను! నన్నొదిలిపెట్టు బాబో!

భటు—ఛీ! లోభీ! నాకు లంచ మిచ్చెద వటరా! ఇది లంచముల కాశించు మీ భూలోకము కాదు. అల్లరి చేయకు పద; పద.
(తోసికొనుచు లాగికొని పోవును.)

(భటులు మఱియొక పాపిని ప్రవేశపెట్టుదురు.)

యము—చిత్రగుప్తా! వీనియుదంత మెట్టిది?

చిత్ర—మహాప్రభూ! వీఁడు బాల్యమునుండియు నిక్కలి జారుఁడై ప్రవర్తిల్లినవాఁడు. సాధ్వియగు నిజభార్య నొకనాఁడైనను కంటఁజూడక క్షోభింపఁజేసి యనేకపరకాంతలతో రమించి తుదకు సుఖవ్యాధులవలన ఘోర మగు మృతినందిన పాపకర్ముఁడు.

యము—ఛీ! వీనిముఖమునఁ గాంచిన మహాదురితములు సంభవించును. ఓరీ, వ్యభిచారపరాయణా! పాపీ!

చ॥ పరవనితానురక్తియు స్వభామినియందు విరక్తిఁ గల్గు పా
మరుని భయంకరాగ్నులను మండెడి కంబమునందుఁ గట్టి భీ
కరముగఁ గాల్చి వ్రేల్చుచు నఘంబులకుం దరియౌఫలంబుఁ జే
కుర నొనరించు టేతగును ఘోరముగా యమలోకమందునన్.

భటులారా! వీని కా శిక్షను గావింపుఁడు. కొనిపొండు.

పాపి—అమ్మబాబో! అగ్గిలో కాలే వుక్కుస్తంభాని కంటగడితే యింకా బ్రతికడ మెక్కడిది. దేవుడా! ఇంతఘోరంగా శిక్షిస్తా రని తెలిసుంటే పాడుముండలకోసం కక్కుర్తి పడేవాణ్ణికానం డోయ్! అందంగావుంటే ఆడవాళ్ళని చూచి మనసు పట్టలేక

యేదో యేడిచానండోయ్! ఈసారికి రక్షించండి బాబూ! ఇక నెప్పుడూ యీతప్పు చెయ్యను. బుద్ధొచింది బాబూ!

భటు—ఛీ! పాపకర్ముండా! నీ కింతలోబుద్ధివచ్చునా? ఈశిక్షనైనఁ గాని బాగుగా బుద్ధిరాదు. రాఁబోవు జన్మమునందైనను సన్మార్గమున వర్తింతువు లెమ్ము. రమ్ము, రమ్ము.

(గెంటుకొనిపోవును.)

(భటులు వేఱొకపాపినిఁ గొనివత్తురు)

యము—చిత్రగుప్తుండా! వీఁడుచేసిన పను లేమి?

చిత్ర—దేవా! వీఁడొక ఘోరహంతకుఁడు. చోరశిఖామణి. ధనమునకై దారులు కాచి, యనేకపాంథులబుఱ్ఱలను బ్రద్దలుకొట్టి చంపెను. అనేకశిశువులను గొంతులు పిసికి తుదముట్టించెను. మహాపాపాత్ముఁడు.

యమ—ఓరీ! దుష్టనరహంతకా! బందిపోటుదొంగా!

చం॥ ధనమును తస్కరించుటకు దారులఁగొట్టి యహేతువైరమున్ గొనుచును, బాటసారులను గొంతులుగోసి వధించు పాపక ర్ముని ఘనవృశ్చికోరగసమూహభరం బగు గోతిలోనఁ ద్రో సిన సరియైనశిక్షయగు జీవము ఘోరవ్యథన్ మునుంగఁగన్.

భటుఁడా! వీని కాశిక్షను విధింపుము. కొనిపొమ్ము.

పాపి—సామీ! సామీ! యెఱక్క సేసినాను. రచ్చించండి. యెవ్వరు సూడలే దని పెద్దపెద్ద కానలనడుమ దార్లుగొట్టింధాను. నడిరేయి ముచ్చిలినాను. పెబువులోరి కంటబడత యని తెలిసుంటే ఆపనికి బోకుందును. జియ్యా!

భటు—ఎవ్వరును చూడలే దని చేసితివా! పోనిమ్ము. ఎవ్వరును చూడకుండగనే యీశిక్షను గూడ ననుభవింతువుగాని రమ్ము.

(ఈడ్చుకొనిపోవును.)

(ఒకభటుఁడు ప్రవేశము)

భటు—మహాప్రభూ! దేవరవారిదర్శనమునకై త్రిలోకసంచారి యగు నారదమునీంద్రుఁ డరుదెంచి ద్వారమున వేచియున్నాఁడు.

యము—సత్వరము ప్రవేశపెట్టుము. చిత్రగుప్తా! నేను నారదునితో సంభాషింపవలసియున్నది. పాపులకు నేటికి నీవే తగినశిక్షలను విధింపుము. పొమ్ము.

చిత్ర—భాగ్యము. (నిష్క్రమించును.)

[నారదుఁడు ప్రవేశము.]

యము—బ్రహ్మమానసపుత్రా! ఇందు దయచేయుము. నీ దర్శనము చిరకాలంబునకుఁ గలిగెను. ఇందులకుఁ గారణ మెద్దియో యుండు ననియే నమ్ముచున్నాను. తెలియఁజేసినయెడలఁ గృతార్థుండ నగుదును.

నార—ప్రభాకరాత్మజా! నేను త్రిలోకసంచారినిగదా! నారాకకు విశేషకారణ మేమి యుండును?

యము—అది నిజమేకాని,

గీ॥ సంయమీంద్ర! ముల్లోకసంచారి వగుట
నీదురాకకుఁ గతముఁ బ్రశ్నింపరాదు
గాని, నీ ముఖచిహ్నము లనినయంత
కారణాంతరాగతుఁడవౌ కరణిఁ దోఁచె.

నార—లేదు లేదు; నిజముగా నే నొక కారణముగల్గి వచ్చినవాఁడను గాను. అది సరిగాని, శమనా! నీకుం గుశలమా?

యము—ఏమి కుశల మని చెప్పుదును! నారదా! దినదినంబును వచ్చు నసంఖ్యాకులగు పాపాత్ములకు శిక్షలను విధింపలేక ప్రాణములు విసిగిపోవుచున్నవి. నాసాటివా రగు నితరదిక్పతు లెద్ద్వరును, సుఖముగా నుండగా నాపాలిటి కీపాపపుకార్యభారము పైఁబడినది.

నార—సూర్యనందనా! తెలియక యడిగెదను. ఎల్లప్పుడును నీలోకంబునకు పాపాత్ములే వచ్చుచుందురా? పుణ్యాత్ము లెవ్వరును, రారా?

యము—రా కేమిగాని, యరుదు.

నార—నేఁడు వచ్చుపుణ్యాత్ము లెవ్వరైనఁ గలరా?

యము—చిత్రగుప్తు నడుగవలెను. సేవకా! చిత్రగుప్తునిఁ బిలువుము.

భటు—చిత్తము. (నిష్క్రమించి చిత్రగుప్తునితోఁ బ్రవేశము.)

యము—చిత్రగుప్తా! నేఁడు మనకడకు రాఁదగిన పుణ్యపురుషు లెవరేనిం గలరా? చూచి చెప్పుము.

చిత్ర—దేవా! మృకండమహర్షికుమారుం డగు మార్కండేయుఁ డను బాలుఁడు, మహాదేవ భక్తశిఖామణి, షోడశవర్షప్రాయుఁ డగు బాలుఁడయ్యును పుణ్యాత్ముఁడు. అతనికి నేఁటితో నాయుర్దాయము చెల్లిపోయినది. కావున వానిం గొనివచ్చుటకై భటుల నంపితిని. వా రీసరికి కొనివచ్చుచునే యుందురు.

నార—(పెద్దపెట్టున నవ్వి) ఏమేమీ! యమధర్మరాజా! మార్కండేయునిఁ బట్టితెచ్చుటకా భటులు పంపఁబడిరి? ఎంత యవివేకము!

యము—(కోపముతో) ఏమి నారదా! నీపరిహాసమున కర్థ మేమి? అవివేక మని పల్కుచుంటివి. ఎవ్వఁ డా యవివేకి? నేనా?

నార—కాదు. కాదు. నీబుద్ధి!

యము—ఆ! ఏమీ! నాబుద్ధియా? ఇప్పుడు నేను నిన్నే యవివేకి యనవలసివచ్చునుగదా!

నార—ధర్మప్రభూ! నే నెన్నటికిని యవివేకిని గానుసుమా!

యము—అట్లయిన నీపరిహాస మేల? కాలము చెల్లిపోయిన ప్రాణులఁ గొనివచ్చుట నాధర్మముకాదా! ఇం దవివేక మెట నున్నది?

నార—ఏటనున్నదియా? ఎఱుఁగనే యెఱుఁగవా?

గీ॥ సంచలించెనొ! నీబుద్ధి సమసినదియొ
కనుఁగొనఁగఁ జాలఁగాని మృకండుతనయుఁ
డవనిఁ జిరజీవిగా నెల్ల నబ్జభవ వ
సిష్ఠు లాశీర్వదింపఁ దజ్జీవహరణ
మునకు శక్తిగల్గునె నీకు? యినకుమార! ౨౮

యము—ఏమేమీ! నారదా! ఆకుమారునకుఁ జిరంజీవిగా నబ్జభవ వసిష్ఠు లాశీర్వదించినారా? వీరి యాశీర్వచనములు వాని యాయుఃప్రమాణమును దీర్ఘమునుగా నొనరింపఁగలవా? చూచెదవుగాక! యముని సామర్థ్యమును!

[ ఇరువురు భటులు ప్రవేశము ]

భటు—మహాప్రభూ! మేము మార్కండేయునిఁ బట్టితెచ్చుటకై యరిగిన భటులము.

యము—అట్లయిన రిక్తహస్తులై యేల వచ్చితిరిరా!

నార—శక్తి లేక.

భటు—స్వామీ! మాయపరాధము లేదు. మేము చనునప్పటికి మార్కండేయుఁడు, శివలింగమునుఁ బూజించుచుండెను. మేమా తని సమీపించినకొలఁదియు, మాశరీరములకగ్నిస్పర్శ కల్గి నట్లు దహింపఁజొచ్చినవి. అంత నాబాలకుని సమీపింపఁజాలక దూరమునుండియే వానిపైకి పాశమును విసరఁగా, నది నడుమనే కాలి భస్మమై పోయినది. చేయునది లేక, మఱలివచ్చి, తమ కీవార్తను విన్నవించుకొంటిమి.

నార—(నవ్వి) ధర్మరాజా! వింటివిగదా! నీభటుల సమర్థతయును, మార్కండేయుని మాహాత్మ్యమును.

యము—నారదా! నన్ను పరిహాసించి గేలిసేయవచ్చితివా? దేవర్షివ గుట దక్కితివిగాక! మఱియొకసామాన్యుండైనచో మదీయదు ర్వారాగ్రహంబున మాడి మసిగాక పోవునా?

సీ॥ తెలియవా? మల్లోకఖలసంఘమానస
ఘనతరాధికభయంకరుని నన్ను
తెలియవా? దినదినోదితపాపజీవనా
కర్షపాశాయితకరుని నన్ను
తెలియవా? రౌరవాది మహాభయంకరా
నేకశిక్షాయుతలోకు నన్ను
తెలియవా? ధర్మజ్ఞధీవిశాలోత్తమ
స్థిరతరజ్ఞానమస్తిష్కు నన్ను
పాపపుణ్యభేదపరికల్పనాలోలు
నలఘుశీలు నన్నుఁ దెలియవొక్కొ?
ఒక్క బాలకునకు నోడుటకే నంత
వెకలిసగుదునయ్య! వెఱ్ఱిమాని!

నాభటులసమర్థులైన నగుదురుగాక! చూడుము. నేను స్వయముగా నిప్పుడే చని మదీయదుర్వారకాలపాశాంచలంబునఁ దన్మార్కండేయనామునిజీవంబులంబట్టి తెచ్చెదను. అట్లుగానిచో నన్నీపేరునం బిలువకుము.

నార—ఈడంబుల కేమిలే! పోయి చూచినఁగదా నీకు స్వయముగా మార్కండేయుని సామర్థ్యము తెలియుట!

యము—ఊఁ! నీసణుగులును వేళాకోళములును ఎప్పుడును నున్నవియే లెమ్ము. నీతో నేమి? —సేవకా! నామహిషవాహనమును సన్నద్ధముచేయుము. (అనుబంధము 37)

(నిష్క్రమణము)

[పటపరివర్తనము]



## రంగము 4. — కోటిలింగమహాక్షేత్రము.

[ప్రవేశము:— శివలింగముఁ బూజించు మార్కండేయుఁడు.]

మార్కం— (అనుబంధము 38.)

హే శంకరా! పాపనాశంకరా! భక్తవశంకరా! నేఁడే నాయాయుర్దాయపరిపూర్ణ మగు దినమగుటకుఁ దారుణముగా, ననతికాలమునకు మానిస్సిరువురు భయంకరాకారులు నన్నుఁ బట్టవచ్చి తామే నిర్హేతుకముగ భీతిల్లి మఱలిచని నట్లు నాకుఁ బొడకట్టినది. వారే యమకింకరులై యుందురు. ఇప్పటికి నీదయచే భయంకర మగు తన్మరణాపాయము తప్పినది. ఇంకముందు నను నా కట్టిప్రమాదంబులు ఘటిల్లనీయకుండ పరిరక్షించు భారమో పరమేశ్వరా! నీభుజాయుగళమునందే కలదు. ఇట్లు నిన్ను నేను ప్రార్థించుచుండుటవలన, నేను మరణమునకు భీతిల్లుచున్నాఁడ నని తలంపకుము. మఱి యేమనిన.

గీ॥ పుత్రకాంక్షచే నీదయాపాత్రులగుచు
కడుపుచల్లఁగ ధాత్రి నన్ గన్నయట్టి
తల్లిదండ్రుల కీమాదితరుణమందు
పుత్రశోకమాఁగద యుంచుఁ బోగులు వాఁడ.

కావున నీ చరణారవింద ధ్యానంబు మనసారఁ గావించువాఁడ.

సీ॥ పార్వతీవరమనః పద్మభాస్వంతాయ!
భర్గాశివాయ! తుభ్యం నమోస్తు!
ఘనతరకలుషాంధకారభాస్వంతాయ
హరకారణాయ! తుభ్యం నమోస్తు!
రజతాద్రివాసాయ! రమ్యత్రిశూలాయ!
భక్తావనాయ! తుభ్యం నమోస్తు!
నిజజటాజూటమానిత బాలచంద్రాయ!
పాపనాశాయ! తుభ్యం నమోస్తు!

భవ్యగంగాధరాయ తుభ్యం నమోస్తు!
ప్రకటత్రిపురాంతకాయ! తుభ్యం నమోస్తు!
ప్రవరశరహరణాయ! తుభ్యంనమోస్తు!
హరహరా! శంకరాయ! తుభ్యం నమోస్తు!

[యముఁడు మహిషవాహనారూఢుఁడై ప్రవేశము.]

యము— (అనుబంధము 39.)

(స్వగతము) అహాహో! ఏమి యీ బాలభక్తుని తేజోవిశేషము! దుర్నిరీక్ష్యమై యొప్పారుచున్నదిగదా!

చ॥ మొగమున శుద్ధసత్వగుణమూర్తి రహింప నిజప్రభావముల్
ధగధగలాడుచున్ శిరముఁ దద్దయు జుట్టివెలుఁగ, నాత్మలో
నగతనయామనోహరు శుభాకృతి నెంచుచు ధ్యానమగ్నుఁడై
యగపడుచుండెఁగట్టకట, సర్భకుఁడై తలఁపుగ్రమూర్తియో?

నారదునిమాటలు కేవలము నిరాకరణార్హములు కావు. ఐనను నాకీ బాలుఁడొక లెక్కయా! కాని, యీ యర్భకుఁడు సదాశివలింగసన్నిధానమున నున్నంతదనుక మత్ప్రయత్నము సఫలీకృతము కాఁజాలఁడని తోఁచుచున్నది. వీని నటనుండి యీవలకు లాగి, జీవంబుల నాకర్షించెదఁగాక! (ప్రకాశముగ) ఓ విప్రబాలకా! మార్కండేయా!

మార్కం—(కన్నులుమూసి ధ్యానమునఁ బలుకకుండును.)

యము—(స్వగ) ఓహహో! ఇతని ధ్యానప్రాబల్యం బెంతటిదియోకాని, మేఘగర్జారవానుకారంబులగు నాపల్కులే యీతనికర్ణంబులఁ దూరకున్నవిగదా! మఱలఁ బిలిచెదఁగాక! (ప్రకాశముగ) ఓ శివధ్యానపరాయణుండవగు మార్కండేయ బాలకా!

మార్కం—(కన్నులు దెఱచి) ఎవ్వరు, నాతపోభంగ మొనరించినవారు? (యమునిఁ జూచి) అహహో! ఎంత గంభీరభీకరాకారము!

సీ॥ అగ్నిగోళంబుల ననుకరించెడు చల
దక్తవిస్ఫార నేత్రములవాఁడు;
ఘనఘనాఘననీలకాంతుల శోభిల్లు
దుర్నిరీక్ష్యాంగవిద్యుతులవాఁడు;
శైలసన్నిభమై పశ్రస్తమై నిశితశృం
గాయతమహిష వాహనమువాఁడు;
అఖిలజీవనజీవహరణసమర్థ ప్ర
దారుణపాశహస్తంబువాఁడు;
కోటిభాస్కరసత్ప్రభ దాటువాఁడు;
ఘనతరాభీలభీమ విగ్రహమువాఁడు;
నిశ్చలుం డయి పిలుచుచు నిలిచినాఁడు;
కాలయమధర్మరాజు గాఁబోలు వీఁడు.

ఇంక నా కాలము తీఱినది గాఁబోలును! శంకరా! భక్తవశంకరా! ఇప్పట్టున నా కన్యశరణ్యము లేదు. పాహిమాం. పాహిమాం.

(అనుబంధము 40.)

యము—బాలకా! పిలిచినఁ బలుక వేల?

మార్కం—మహాత్మా! మీ రెవ్వరు? ఇట్లు నాతపోభంగము గావింప ధర్మజ్ఞు లగు తమవంటివారికిఁ దగునా?

యము—కుమారా! నేను ప్రేతలోకనాయకుండను; యమధర్మరాజనామంబునఁ బరఁగువాఁడను. ధరణిపై నాయుష్కాలము చెల్లిపోయిన సమస్తజీవకోటులను నేను నాలోకంబునకుఁ గొనిపోయి, తత్తత్పాపపుణ్యార్హము లగు శిక్షలను విధించుచుందును. నేఁటితో నీకును గాలము చెల్లినందున నిన్నుఁ గొనిపో వచ్చితిని.

మార్కం—యమధర్మరాజా! నీవు ప్రాణిలోకభయంకరుఁడవనియు మహాబీభత్సస్వరూపివనియు లోకంబునఁ బ్రతీతి కలదు. కాని, యందులకుఁ బరిపూర్ణవ్యతిరేకముగ, మహాశాంత

స్వరూపము గల్గి, వాత్సల్యభరితపరిసంగంబుఁ గావించుచున్న నిన్నుఁ జూడఁగా నా కాశ్చర్యము గల్గుచున్నది.

యము—వత్సా! అట్టి భీకరాకారంబున నేను పాపాత్ములకు మాత్రమే కాన్పింతును. నీవంటి పుణ్యపురుషులకు సౌమ్యరూపినై కాన్పింతును. అందును నీవు శివవరప్రసాది వగు కారణజన్ముండవైనందున, నీ భౌతికశరీరంబునకే నీకుఁ గాన్పించితినిగాని, మానవచక్షువులకు నాస్వరూపం బగోచరంబు.

మార్కం—మహాత్మా! నీ దివ్యాకారసందర్శనం బొనరించి ధన్యాత్ముఁడనైతిని. శివపూజాపరతంత్రుఁడనై యుండుట నిటనుండియే నమస్కరింతును.

యము—(పాశమును సవరించుచు) మార్కండేయా! ఇచ్చటఁ గూర్చుండి నీవు నమస్కారములతోఁ దృప్తిపఱచుటవలనఁ బ్రయోజనము లేదు. ఇఁక నీకు శివపూజాప్రాప్తి లేదు. నీప్రాణవాయువులను నేను గొనిపోవలయును. ఆ శివలింగమును వదలి యీవలకు రమ్ము.

మార్కం—పుణ్యాత్మా! సర్వజ్ఞు లగు మీరే యిట్టి యధర్మకర్మం బొనరింపఁ బాల్పడిన బాలుఁడ నగు నే నేమనఁగలవాఁడను?

యము—ఏమంటివి? నే నధర్మం బొనరించుచుంటి ననియా? సదాశివుఁడు నీ కనుగ్రహించిన షోడశవత్సరంబులును నేటితోఁ దీరినవి. కావున నీప్రాణములం గొనిపోవుటయే ఇప్పట్టున నాకు ధర్మమైయున్నది. అధర్మ మెట్లగును?

మార్కం—ఆర్యా! అందఱును ఎవరిధర్మమును వారు నిర్వహించుటయే, ప్రశంసార్హమగు విషయము. మీధర్మమును మీరు నిర్వహించునటులనే నాధర్మమును నేను నిర్వహించుచున్నాను. దాని నాటంకపఱుప యుక్తమా! దేవా!

గీ॥ చిరము శ్రీసదాశివుపాదసేవఁ జేసి,
ధన్యతను జెందుటే నాకు ధర్మమయ్య
రమ్యచరిత! స్వధర్మానురక్తిఁ జేసి,
యాస్యధర్మంబు హరియింప నగునె నీకు?

**యము**—బాలకా! నీ వెంత ప్రాజ్ఞుండ వైనను, బాల్యచాపల్యంబునం జిక్కి యమలోకం బనినంతనే భీతిల్లి నా వెంట నరుదెంచుటకుఁ గొంకుచున్నా వని తోఁచుచున్నది. నీవు పుణ్యాత్ముఁడవు. నీ వంటివారికి నాలోక మెంతమాత్రమును భయాస్పదంబు గానేరదు. యమలోకమునందలి దక్షిణద్వారంబున కావలం గల ప్రదేశం బొక్కటి మాత్రమే జీవలోకభయదాయకంబై యుండును. కాని, యితర సర్వలోకంబును నత్యంతరమణీయంబై మహానందప్రదంబై యుండును. నీవు పుణ్యాత్ముండ వగుటచే ప్రకృతిరమణీయం బగు నొకసుందరప్రదేశమునకుఁ గొనిపోఁబడి యటనుండి, నీ కర్హంబగు పుణ్యలోకంబునకుఁ బంపఁబడుదువు. నీ వేమాత్రమును భీతిల్లక నా వెంట రమ్ము.

**మార్కం**—మహాత్మా! స్వచ్ఛందక్రూరస్వభావుఁడవనియు, దయాధర్మదూరుఁడ వనియు లోకులచే నపఖ్యాతిగన్న నీవంటివాఁడు నాయందుఁ జూపిన యపూర్వకృత్రిమవాత్సల్యంబునకు దలంచిన నాశరీరము పరవశం బగుచున్నది. కాని యోధర్మప్రభూ! నీవు నక్కాణించిన సౌఖ్యంబులేవియు, శివపూజాపరాయణత్వంబున నాకుఁ గల్గుచున్న బ్రహ్మానందంబునకు సాటిరావు. కావున, నీవు నిజముగా నాయందు వాత్సల్యముఁ గలవాఁడ వగుదువేని నన్నిందే యుండనిమ్ము.

**యము**—వత్సా! నీవు తెలియక పల్కితివి. నాయభీష్టానుసారముగ నీపై ననుగ్రహంబును గాని యాగ్రహంబును గాని చూపుటకు నా కెట్టియధికారంబును లేదు. నేను విధినిర్ణయబద్ధుఁడనై నాధర్మంబును నిర్వర్తింపవలసియున్నది. నీవు నాతో సంవాదంబొనరించుచు కాలయాపనంబొనరించుట మహాపరాధం

బగును. నీమరణకాల మతిక్రమించినది. ఆ శివలింగమును వదలి యీవలకుఁ గదలిరమ్ము.

మార్కం—ఓ దయాస్వరూపా!

గీ॥ పుణ్యపురుషులు జీవులఁ బుణ్యకార్య
ములకుఁ బ్రోత్సహింతురుగాని, యులఁతి నిట్లు
శంకరారాధనము మానఁజను నటంచుఁ
బల్కుదురె? వింతయయ్యె నీపల్కురీతి.

యము—ఔరా! బాలకా! సౌమ్యంబున నెంత జెప్పినను వినక, మేరమీఱి వాదంబున కియ్యకొనుచుంటివిగా? ఏమి నీ సాహసము? ఈ సహస్రకోటిబ్రహ్మాండములు నిర్మింపఁబడినదాదిగా ప్రచండం బగు నీయమునిశాసనంబును మీఱి ప్రతివాదంబు సల్పిన ప్రాణి యింతవఱ కెందును గానరాదయ్యె. నీ వొక్కండవే యిట్టి దురాగతం బొనరింప నాయత్తం బైతివి. ఇది నీకు నాశనహేతువుగాని శ్రేయస్కరముగాదు. ఇంతవఱకును నీవు మహాదేవభక్తశిఖామణి వని గౌరవభావంబునఁ జూచితి. ఇఁక ముందు నిన్ను మన్నింపను. దైవతిరస్కారంబు గావించిన మహాదురితంబు నిన్ను ఘోరనరకంబునం ద్రోయఁగలదు. నరకం బనిన నీ వేమిగా భావించితివో— వివరించెద నాకర్ణింపుము—

సీ॥ పొగలుమంటలు గ్రమ్మి భుగభుగ మని క్రాగు
చుండు తైలఘటంబు లొక్కచోట,
నభమంట మండు మంటలతోడ, నొప్పారు
నుక్కుకంబంబు లొక్కొక్కచోట,
వృశ్చికపన్నగావృతములౌ భయదాయు
కోగ్రగర్తంబు లొక్కొక్కచోట,
కూర్రత రంపాలఁ గోసి కారముఁ గూరు
చుండు మదోద్భటదైత్యు లొక్కచోట,

చీము నెత్తురుగూడి వచింపరాని
యురుజుగుపాన్సప్రవాహంబు లొక్కచోట,
ఉక్కుముక్కలుగలకాకు లొక్కచోట,
వెలయు నరకంబునందున విపరీతనయ!!

కావున నట్టి నరకంబునందలి భయంకరయాతనలం బడక నాహితంబు నాలకించి యా లింగమును వదలి రమ్ము. కాదేని, బలిమిం గొనిపోయి భయంకరప్రకారంబుల నిన్ను శిక్షింపఁ గలవాఁడ నని తెలిసికొనుము.

మార్కం—దేవా! ఇంతదనుక నీ వస్వతంత్రుఁడ వని పలికి యిప్పుడు తద్వ్యతిరేకంబుగ, నహంకారము వహించి కర్తృత్వంబును నీయం దారోపించుకొనుచున్నవాఁడవు. ఇందువలన నీపై నాకు తొలుతగల్గిన గౌరవంబు రవంత సన్నగిల్లె నని పల్కుటకు చింతిలుచున్నవాఁడను. ఓ మహాత్మా!

చ॥ సకల లయాధికారి యగు శంకరునాజ్ఞను దాల్చి నీవు, నీ
యకలుషధర్మమున్ సలుపునట్టి యశక్తుఁడ వైతివేని, నేఁ
బ్రకటముగాఁగ శంకరునిప్రాపునఁ జేరితి; సర్వశక్తి నీ
కొకనికె గల్గునేని కరుణోదధి వేడితి నన్నుఁ గావుమా!

యము—ఛీ! ఇంక నీదురాలాపంబులను, యుక్తివాదంబులను గట్టిపెట్టుము. సర్వప్రాణిసమానుండనై నావెంట గదలి నీయంత ట వచ్చెదవా సరే! లేదేని యిదే మత్కాలపాశంబున నీప్రాణవాయువులను బలవంతముగ నూడ్చి యీడ్చుకొనిపోయెద!

చ॥ యముఁడన నేమిగాఁదలఁచితో వెడగా! యిటువాదులాడ, నీ
యమనియమాదియోగము, లిహంబున నాయువు గల్గునంతకా
లమ్మె యనుమాట నాత్మను దలంపవె! మృత్యువుపైనఁ బద్ధకా
లముననను వాదులాడెదవు! లక్ష్యముసేయవొ నన్ను డింభకా!

మార్కం—మహాత్మా! నా ప్రార్థనంబును నిరాకరించెదవా?

యము—ఛీ! నీ ప్రార్థనంబులు నాకడ సాగరావు! నీయాయువు చెల్లినది! నిన్నుఁ గొనిపోవక మానను!

[పాశమును మెడకుఁ దగిలించును.]

మార్కం—(శివలింగమును గట్టిగా నాలింగనము చేసికొని) హేభక్తకల్పవృక్షమా! సదాశివా! శంకరా! నీపాదభక్తుండను నన్ను రక్షింప నిదే తగుసమయము! మాం పాహి! మాం రక్ష!

మ॥ జనసంబాధిగ నీపదద్వితయముం జక్కా సద్భక్తితోఁ గొల్చి నీ
ఘనకారుణ్యముఁ జూరగొన్న నిజభక్తశ్రేణి నొక్కండనై
దినముల్ బుచ్చుచునున్న బాలు ననుఁ బ్రోద్వీర్యప్రభాయుక్తిగా
కొనిపోవంజనుదెంచె కాలుఁడు మహోగ్రుండై; ననుం గావవే.

గీ॥ భక్తమందార! శంకరా! పాపదూర!
కాలకంఠ! మృత్యుంజయా! బాలచంద్ర
మౌళి! యసమాంబకా! యుమాకళత్ర!
శూలహస్త! నన్నాపాడు వేళ యిదియె.

(అనుబంధము 41.)

[యముఁడు పాశమును లాగఁబోవఁగా లింగమును బ్రద్దలుచేసికొని, భయంకరాకారముతో శంకరుఁడు ప్రత్యక్షమగును.]

శంక—ఒరే! మూఢాత్మా! ప్రేతలోకనాయకా! మద్భక్తశిఖామణి యగు మార్కండేయుని ప్రాణములం గొనిపోవ నీకెంతటి సాహసము గల్గెనురా! ఇఁక నీవు చచ్చితివి చూడు!

(శూలముచే యముని సంహరించును.)

యము—(విగతజీవియై భూమిపైఁ గూలును)

మార్కం—(చేతులు జోడించి)

—దండకము—

శ్రీపార్వతీనాథ! శీతాచలావాస! ఫాలాక్ష! లోకైకరక్షా! మహాదేవ! యోశంకరా! భక్తరక్షంకరా! పాపనాశంకరా! మన్మ

ధప్రాణహారీ! శ్మశానప్రచారీ! నమో! దివ్యకాపాలికాహార సంహారకారా! నమో! దేవ! గంగాధరా! పావనాకార! యో బాలచంద్రాంకితత్యుత్తమాంగా! నటత్ప్రేతరంగా!, మహాదైత్యభస్మాసుర ప్రాణభంగా! నమస్తే! నమస్తే! నమః.

[నారదుఁడు ప్రవేశము.]

**నార**—(శంకరునకు నమస్కరించి) హే మహాదేవా!

గీ॥ క్షితి మృకండాత్మజాతు రక్షించుకతన
నీదుభక్తావనయశంబు నిలిచె నేఁడు
కాని శమనునిఁ జంపిన కారణమున
ధర్మసంరక్షణమునకు తాపు చెల్లె.

కావున నోదేవా! అవివేకంబున, నహంకరించిన యీయముని క్షమియించి నాప్రార్థనమును మన్నించి బ్రతికింప వేడుచున్నాను.

శంక—నారదా! నీపలుకులు సమంజసంబులు. ఇప్పటికి మన్నించి యీయముని ప్రాణంబుల రక్షించితిని—ఓరీ! దక్షిణ దిక్పతీ! అధికారగర్వంబున నొడలెఱుంగక తత్పాపఫలంబున సమసిన నీవు నీపుణ్యంబున బ్రదికితివి లెమ్ము. ఇఁకనిట్టి యవివేక కార్యంబు నెన్నఁడు నొనరింపకుము.

(యముఁడు లేచి సిగ్గుపడుచు శంకరునకు నమస్కరించి)

**యమ**—దేవా! త్రిమూర్త్యాత్మకస్వరూపుండవగు నీచే నిర్ణయింపఁబడిన, నేను నావిధిని నిర్వహించితిని. అందుల కాగ్రహించి మీరు నన్ను సమయింపితిరి. ఇందు నా యపరాధ మేమి యున్నది?

శంక—ఓరీ మూఢా! విధ్యుక్త కార్యనిర్వహణంబునందును దేశకాలపాత్రంబులను చర్చింపవలయును. నేఁటినుండియు నాభక్తులజోలికి రాకుము. ఫలం బనుభవింపఁగలవు.

**యమ**—మహాప్రసాదము.

శంక—మార్కండేయా! నీ కింక మృత్యుభయము లేదు. నేటినుండియు నీవు నాభక్తుఁడవై మహాయశముం గాంచి, చిరంజీవి వగుదువు గాక! ఇంక నీకేమి కావలెను?

మార్కం—మహాదేవా! నీమహత్తర కృపాలాభముం గాంచిన నాకిం కెట్టి కోరికలును లేవు; ఐనను లోకమంగళం బగున ట్లను గ్రహింపుము. (అనుబంధము 42.)

[పటపరివర్తనము]

---

శ్రీ

మహాభక్తవిజయమున "మార్కండేయ" అను చతుర్థాంకము సంపూర్ణము.



శ్రీ

# మహాభక్తవిజయము.

## పంచమాంకము.



# ఇందలి పాత్రలు.



## పురుషులు

1 ఉత్తానపాదుఁడు

2 ధృవుఁడు

3 ఉత్తముఁడు

4 విష్ణువు

5 నారదుఁడు

## స్త్రీ

సురుచి





# శ్రీ మహాభక్త విజయము.

పంచమాంకము.

## ధ్రువ చరిత్ర.

రంగము 1. —సురుచిమందిరము.

(ప్రవేశము : ఉత్తానపాద మహారాజు, సురుచీదేవి సుఖాసీనులై)

ఉత్తా—దేవీ! ఆ ప్రసంగ మిపు డేమిటికి?

సురు—అందులకుఁ గాదు; కుమారు లిరువురియందును మీకుఁగల పక్షపాతబుద్ధి యెంతవరకుఁ గలదో యరయఁ గోరి యడిగితిని.

ఉత్తా—ఇందు పక్షపాత మేమియున్నది?

సురు—పక్షపాతము కాదా? సంక్రాంతిమహోత్సవమునాఁడు మీరు కుమారుల కిచ్చిన బహుమానములే మీ పక్షపాతబుద్ధిని స్పష్ట పఱచుచున్నవి. నాసవతికుమారుఁ డగు ధ్రువునకు మణిహార మును, నాకుమారుఁ డగు నుత్తమునకొక స్వర్ణకంకణమును నిచ్చితిరి. ఇరువురును మీ కుమారులే యై యుండ, మీకీ పక్షపాతబుద్ధి యేల?

ఉత్తా—అది పక్షపాతమా! ధ్రువుఁడు జ్యేష్ఠుఁడు; రాజ్యార్హుఁడు ఉత్తముఁడు కనిష్ఠుఁడు; రాజ్యార్హత గలుగనివాఁడు. అందుచే నామాత్రపుభేదము యుక్తమే. ఐనను విలువయందు స్వర్ణకంక ణము మణిహారమునకుఁ దీసిపోదుసుమా!

సురు—ఇదియే మీ పక్షపాతము, మాటలలోనే వ్యక్తమగుచున్నది!
(అనుబంధము 43.)

ఉత్తా—దేవీ! ఉత్తమగుణసంపన్నుఁడై రాజ్యార్హుఁడైన జ్యేష్ఠకుమారునకు తండ్రినగు నే నంతమాత్రపు బహుమానము నొసంగుట కేనియుఁ దగనా? అదుగో! ఉత్తముఁడిట్లే వచ్చుచున్నాఁడు.

[ఉత్తముఁడు ప్రవేశము.]

సురు—నాయనా! ఇటురమ్ము. ఇంతసేపటినుండియు నెటనుంటివోయీ!

ఉత్త—అమ్మా! అన్నయ్య భగవద్గీత చదివి వినిపించుచుండెను. బాలురమందఱమును వినుచుంటిమి! ఆహాహా! భగవద్గీతాశాస్త్ర మెంత యుత్కృష్టగ్రంథ మమ్మా!

సురు—ఏ మేమీ! నీయన్న నీకు వేదాంతోపదేశములు చేయుచున్నాఁడా? ఇఁక మీరందఱును విరాగులై పోవుదురా యేమి?

ఉత్తా—దేవీ! భగవద్గీత చదివినంతనే విరాగులైపోవుదురా? అట్టి మహాగ్రంథపఠనమునందు మనబాలుర కట్టి యాసక్తిగలిగినందులకు మన మానందింప వలెనుగాని.........(ఉత్తముని వామాంకమున గూర్చుండబెట్టుకొని) తండ్రీ! భగవద్గీత నీ కానందకరముగ నున్నదియా? ఇట్టిగ్రంథములనే చదువుము. పనికిమాలిన శృంగారగ్రంథములపొంతలఁ బోవలదు.

(ధ్రువుఁడు ప్రవేశము)

ఉత్త—అదుగో! అన్నయ్య వచ్చినాఁడు.

ఉత్తా—నాయనా! ధ్రువా! రమ్ము. నాతొడతొడపైఁ గూర్చుండుము. తమ్మునకును - తక్కిన బాలకులకును భగవద్గీతాశాస్త్రముం జదివి వినిపించితివఁట! అందుగలసారమేమి గ్రహించితివి తండ్రీ!

ధ్రువు—(తండ్రితొడపైఁ గూర్చుండును.)

సురు—(ధృవుని తండ్రితొడనుండి క్రిందికి లాగి) బాలకా! తొలఁగు మా దక్షిణాంకమునుండి. సునీతిగర్భమున జన్మించిన నీ కట్టి యధికారము గలుగదు. నీతండ్రి దక్షిణాంకమున నాసీనుఁడ వగు నధికారము గలుగవలయునేని, చిరతపం బాచరించి నాగర్భంబున జన్మింపుము—పొమ్ము.

( అనుబంధము 44.)

ధృవు—(దుఃఖముతో తొలఁగుచున్నాఁడు.)

ఉత్తా—దేవీ! ఇది యేమి యన్యాయము? సవతికుమారుఁడైనంతమాత్రమున ధృవకుమారుని, నీ విట్లగౌరవింపఁదగునా?

సురు—చాలుచాలు—నాకు మీరు చక్కట్లు చెప్పనక్కర లేదు! మీ దక్షిణాంకమున నాసీనుఁ డగు నదృష్టమేయున్నచో ధృవుఁడు నాగర్భముననే జన్మించియుండును. సునీతి కేల జన్మించును?

ఉత్త—అమ్మా! అన్న మొగమువంకఁ జూడుము! ఎట్లు దుఃఖించుచున్నాఁడో! నీగర్భమున జన్మింపకుండు టాయనదోష మగునా!

సురు—బాలకా! నీకుఁ దెలియ దూరకుండుము! ధృవా! నీవు దుఃఖించుచుండినఁ బ్రయోజనము లేదు! నాయానతి వినుము.

గీ॥ గీతఁ బతియుంపఁగల్గిన నీతివేత్త
వగుదు వేని, మహాటవి హరిని గూర్చి
ఘనతపం బాచరించి నాగర్భమందు
జననమందెదు నర్హతఁ గనుము పొమ్ము!

ధృవు—తల్లీ! నీయాజ్ఞ నాకు సదా శిరోధార్యమైనది. అట్లే యొనరించెదఁగాక! నన్నాశీర్వదించి పంపుము.

ఉత్తా—ఆఁ! ఆఁ! కుమారా! ఏమి నీసాహసము? ఈబాల్యంబున నీ వడవి కరుగుట యేమి? విష్ణుసాక్షాత్కృతిం గాంచు టేమి?

ధృవు—తండ్రీ! మీరు నాకై విచారింపవలదు. మాతృశాసనంబును శిరంబున ధరించి యడవులకరిగిన శ్రీరామచంద్రునికరణి నేనును నడవుల కరిగి, శ్రీ మహావిష్ణునిఁ గూర్చి తపం బాచరించి, తత్కృపాలబ్ధుండనై మఱలివచ్చెదఁగాక!

సీ॥ ఆశీర్వదింపుమా! యమ్మరో! నీగర్భ
మున జనించెడునర్హతను గణింతు;
తండ్రిరో! నీదుస్వాంతమునఁ జింతిలకుమా!
హరికృపాప్రాప్తి నందివత్తు;
ఉత్తమా! నాకయి తత్తరింపఁగఁబోకు
మతిరయంబున వత్తునయ్య మరలి;
నేఁ గొల్చు దేవతానీకంబులార! న
న్నరయుఁడీ గురుకృపాభరముమీర;
అణువునందు మేరుఘనశైలమునయందు
నఖిలస్థాణుజంగమాంతరముల
నిండియున్న దేవ! నిఖిలేశ! పరమేశ!
నీపదంబునందు నిలుపుకొనుము. (నిష్క్రమించును.)

రంగము 2. — అరణ్యము.

(ధ్రువుఁడు ఒంటరిగ ప్రవేశము.)

ధ్రువు—(అనుబంధము 45.)

కటకటా! ఎంతసాహసించి యీమహారణ్యమునఁ బ్రవేశించితిని? నే నిప్పు డెందుఁ బోవుదును? ఎవరు నాకు దిక్కు?

సీ॥ గాండ్రుగాం డ్రనుచు వ్యాఘ్రము లొకవంక, ఘో
షిల్లి గుండెలు తల్లడిల్లఁజేయ
బుసుబుస్సు మంచును భుజగంబు లొకవంక,
భయదాకృతులను బైపైకి రాఁగ
కాలుమోపినయంత, ఘనతరంబుగఁ జుఱు
క్కని గ్రుచ్చుకొను గంటకాళియొకట
సాంద్రాటవులనెల్లఁ జటిలుపెటే లని
యొకవంక దావాగ్ను లుజ్జ్వలింప
నుదరమందున క్షుద్బాధ యొక్కవంక
జీవపంచవాయువుల శోషిల్లఁజేయ
ముక్తిఁ గాంచవచ్చినఁ బ్రాణముక్తి గలుగు

నారదాదిమునీంద్రవందితచరణారవింద! గోవింద! నన్ను రక్షింపుము.

(నారదుఁడు ప్రవేశము)

నార—(స్వగతము.) ఎవరు నాపేరెత్తినారు?.........ఓహో! తెలిసె! తెలిసె! ఉత్తానపాదునికుమారుఁడగు ధ్రువుఁడతి సాహసంబున నీయరణ్యంబున, విష్ణుసాక్షాత్కారంబును గాంచునాశతో నరుదెంచెను. ఆహా! బాల్యంబున నీతనికిఁ గల్గిన సాహసగుణంబును మెచ్చవచ్చుఁగదా!

చ॥ అరయఁ బదారువత్సరము లైననుఁ బ్రాయములేదు; సాంద్రభీ
కరవనవాటి గ్రుమ్మరఁగఁ గల్గిన సాహసమైన లేదు; కా
పురమున హేయభావమును బొందువయస్సును కాదు; కేవలం
బురుతరరోషపూర్ణమతి నొక్కఁడె యెంత తెగించె నద్దిరా!

ఇతని కెద్దియేని తరణోపాయంబు నెఱింగించి ముక్తిమార్గదర్శకుండ నగుదునుగాక!—(ప్రకా.) కుమారా! ధ్రువా! నీకు శుభం బగుఁగాక!

ధ్రువు—ఓహో! ఏమి నాభాగ్యము! ఈ మునీంద్రుఁ డెవ్వరో విపదంబుధినిఁ దరిఁగానక పరితపించుచున్న నాకు శుభంబు వక్కాణించెను. మహాత్మా! అయాచితదయాంతరంగులై నాకు శుభంబు వక్కాణించిన మీ కనేకవందనంబులు! తమరెవ్వరు? ఈ దీనునియం దింతేటికారుణ్యంబు గల్గుటకుఁ గతం బేమి?

నార—ధ్రువకుమారా! నేను త్రిలోకసంచారి నగు నారదుఁడను. బాల్యంబుననే నీకుఁ గల్గిన యీ వినిర్మలభక్తిభావంబునకును, సాహసంబునకును మెచ్చి నీకు ముక్తిమార్గముం జూపవచ్చితిని.

ధ్రువు—ఆహాహా! ధన్యుఁడను. బ్రహ్మమానసపుత్రా! ధన్యుఁడను. తమదివ్యసందర్శనంబే నాకు విష్ణుదర్శనం బైనట్లయ్యె. నాకుఁ దరణోపాయముం జూపుఁడు.

మ॥ మునినాథోత్తమ! నే నకించనుఁడ నీ మూలంబునన్ ధన్యతం
గనను న్నాఁడ; విమాతయాజ్ఞఁగొని యుగ్రారణ్యముం జేరితిన్

కనలేనైతిని ముక్తిమార్గమును శోకచ్ఛన్నమాయాబ్ధి ము
న్గిన నాకీవొక యానపాత్రివయి యుక్తిన్ దాటఁగాఁజేయుమా.

నార—కుమారా! నీవు నిజముగా ధన్యుఁడవు, ఇంత చిఱుతప్రాయం
బున నీకుఁ గల్గిన భగవద్భక్తియే నీకుఁ దరణోపాయసాధనం
బయి మార్గదర్శకం బగును. నేను నిమిత్తమాత్రుండను. నీకు
నారాయణాష్టాక్షరీ మంత్రోపదేశంబుఁ గావించెదను. దానం
జేసి నీ కనన్య దుర్లభం బగువిష్ణుసందర్శనప్రాప్తిగలుగుఁగాక!
(చెవిలో మంత్రోపదేశముం జేసి) (అనుబంధము 44.)

కుమారా! ఇంక నాకుఁ గాలాతీతంబయ్యె! చనియెదను.
నీకు శుభంబగుగాక! (నిష్క్రమించును.)

ధ్రువు—భళిరే! ఏమి నా భాగ్యము! మహాత్ముండగు నారదమహర్షి
యనూనానుగ్రహవశంబున నారాయణాష్టాక్షరీదివ్యమంత్రోప
దేశము నొందితిని.

సీ॥ ఘోరమహాపాపాంధకారంబునకు భాను
దీప్తి నారాయణదివ్యజపము
కలుషాటవులఁ గాల్పఁగల్గు దావానల
దీప్తి నారాయణదివ్యజపము
సంసృతిదుర్గుణాశాపాశముల కసి
దీప్తి నారాయణదివ్యజపము
గురుభవాంభోనిధి దరియించునౌకాప్ర
దీప్తి నారాయణదివ్యజపము
దివ్యమానీంద్రమహిమ నీ దివ్యజపము
మత్సుకృతమునఁ గరతలామలకమయ్యె
నింక మోక్షమార్గంబు నాకీ జపంబె
కలుగఁజేయు మహానందకలితమగుచు.

(అనుబంధము 47.) (నిష్క్రమించును.)

రంగము 3 - ధ్రువతపోవనము.

(ధ్రువుండు నేకపాదమున నిలిచి జపము సేయుచుండును.)

ధ్రువు--(అనుబంధము 48, 49.)

నారాయణా! చతుర్వేదపారాయణా! ప్రళయసమయవట పత్రసంచారపరాయణా! సోమకాసురగర్వాపహారణప్రవీణా! చతుర్ముఖావన పరతంత్రచతుర్వేద మంత్రసంరక్షణా! నీ దివ్యప్రథమావతారసందర్శనంబు నొసంగి నను ధన్యాత్మునిం జేయుము. పాహిమాం - పాహిమాం.

(విష్ణువు మత్స్యావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 50.)

(విష్ణువు తిరోహితుం డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హేనారాయణా, హే దేవదానవలోకావనా! మంథరోర్వీధర భారవహన, లోకైకసంరక్షణా! కల్పక కామధేను చింతామణీ పారిజాత, సోమసూర్యాది సమస్తగ్రహ సముదాయ సంకల్ప మాత్ర సృష్టికారణా! జగన్మోహినీ దివ్యస్వరూపావతార ధారణా! యుష్మద్ద్వితీయావతారం బగు కూర్మస్వరూపమున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము! పాహి మాం, పాహిమాం.

(విష్ణువు కూర్మావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 51.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హేనారాయణా! ప్రబలనిజదంష్ట్రాగ్రతల సర్వసర్వం సహోద్ధరణా! హిరణ్యాక్షదనుజాధమ గర్వాపహారణా! నిజ ఖురతలవేలాసంక్షోభప్రవీణ! యుష్మత్తృతీయావతారంబగు

వరాహస్వరూపంబున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం - పాహిమాం.

(విష్ణువు వరాహావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 52.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హేనారాయణా! చటులనిటల భృకుటీ ప్రసారమాత్ర హిరణ్యకశ్యప గర్భసంచ్ఛన్న ప్రవీణశౌండ! అయఃపిండప్రపాత గర్భవిదీర్ణాయమాన ఘణంఘణారావ సమ్మిళిత చటేల్ ఫటేల్ భయదశబ్ద పరిపూర్ణదానవేశ్వర కరగ్రస్త భీషణగదాదండ పాతనిర్భిన్న స్తంభసంజనిత గంభీర భీషణ నరకేసరీస్వరూప సముద్భవాకార! యుష్మత్తురీయావతారం బగు నృసింహస్వరూపంబున సాక్షాత్కరించి, నన్ను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం - పాహిమాం.

(విష్ణువు నృసింహావతారధారియై దర్శనం బిచ్చును)

ధ్రువు—(అనుబంధము 52.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 53)

హేనారాయణా! జలకలశచ్ఛత్రధృతకరయమళబ్రహ్మచారీ! త్రిభువనసంచారపరాయణశక్తిప్రపూర్ణ మహాత్రివిక్రమావతారధారీ! బలిమహాదనుజ మోక్షదాన లీలామానవ విగ్రహా! యుష్మత్ పంచమావతారం బగు వామనావతారంబున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం. పాహిమాం.

(విష్ణువు వామనావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 54.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హే నారాయణా! క్షత్రియవంశకాంతార ప్రచండదావానలా! భీషణ రక్తసంకలిత పరశుమహాయుధాలంకృతాంసభాగా! కార్తవీర్యార్జునమదగర్వనిర్వాపణచతురా! యుష్మత్ షష్ఠావతారంబగు పరశురామ స్వరూపంబున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం - పాహిమాం. (విష్ణువు పరశురామావతారధారియై దర్శనంబిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 55.)

(విష్ణువు తిరోహితుఁడగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హే నారాయణా! రావణకుంభకర్ణాది శతసహస్రభయంకరరక్షఃకంఠవిలుంఠన భీషణ కోదండాయత పాణిపంకేరుహా! జనకరాజేంద్రనందినీమనఃకువలయ పరిపూర్ణపూర్ణిమాశశాంక కోమలశ్యామలాంగ! హనుమద్విభీషణాద్యఖిల భక్తవజంవన మహత్తర ప్రభావ పరిపూర్ణ! సాకేతపురాలంకార! యుష్మత్ సప్తమావతారంబగు శ్రీరఘురామస్వరూపంబున సాక్షాత్కరించి, నను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం-పాహిమాం.

(విష్ణువు శ్రీరఘురామావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 56.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హే నారాయణా! గోపికావస్త్రాపహరణ లీలానాట్యవిగ్రహా! కాళిందీ మహాపన్నగాభోగాగ్రనటన్మనోహరస్వరూప! కంస శిశుపాల జరాసంధ దంతవక్త్ర ప్రముఖ నిఖిలదానవగర్వాపహారీ! రామానుజా! యుష్మదష్టమావతారంబగు శ్రీకృష్ణస్వరూపంబున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము. పాహిమాం-పాహిమాం.

(విష్ణువు శ్రీకృష్ణావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 57.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హే నారాయణా! అహింసాతత్వప్రబోధనాపరతంత్ర! పరమభూతదయాపర! పరిత్యక్త దారాసుతనిజసామ్రాజ్యాద్యుత్తమసుఖానుభవ! యుష్మన్నవమావతారం బగు శ్రీబుద్ధస్వరూపంబున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ గావింపుము! పాహిమాం! పాహిమాం!

(విష్ణువు బుద్ధావతారధారియై దర్శనం బిచ్చును.)

ధ్రువు—(అనుబంధము 58.)

(విష్ణువు తిరోహితుఁ డగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హేప్రభూ! దశమంబును యుష్మద్భవిష్యావతారంబును నగు కలిక్యవతారంబున సాక్షాత్కరించి నన్ను ధన్యునిఁ జేయుము.

ధ్రువు—(అనుబంధము 59.)

(విష్ణువు తిరోహితుఁడగును.)

ధ్రువు—(అనుబంధము 48.)

హే నారాయణా! గరుడఖగేంద్రాంసభాగారోహ జగన్మోహనాంగా! శంఖచక్రగదాపద్మయుక్త కరచతుష్క దివ్య శ్యామలస్వరూపా! వనమాలికాకౌస్తుభరత్నాలంకృత నిజ వక్షఃప్రదేశ! అచ్యుతంబై అనాదిపూరుషంబై అనంతంబై అసమానంబై క్షీరసాగరంబున ననంతగరుడవిష్వక్సేనాది నిత్యసూరులచేఁ బరివేష్టింపఁబడు యుష్మచ్చిదానందవిగ్రహమున సాక్షాత్కరించి నను ధన్యాత్మునిఁ జేయుము.

( విష్ణువు గరుడవాహనారూఢుఁడై దర్శనం బిచ్చును. )

ధ్రువు—(అనుబంధము 60.)

విష్ణు—కుమారా! నీ యసామాన్యమైన నిశ్చలభక్తి కానందించితిని. నీజన్మము తరించెను. నీరాకకై నీమాతాపితరులు శోకించు చున్నవారు. సత్వరంబుగ నీవు నిజగృహంబున కరిగి, యొక మన్వంతరముదాక రాజ్యసుఖంబుల ననుభవించి యనంతరము నీపేర నొప్పారనున్న ధృవమండలంబున నాకల్పాంతము విల సిల్లుదువుగాక! నీకు శుభం బగును.

ధ్రువు—మహాత్మా! ధన్యోస్మి! ధన్యోస్మి! (అనుబంధము 61)

[పటపరివర్తనము.]

శ్రీమహాభక్తవిజయమున "ధ్రువచరిత్రము" అను

పంచమాంకము

సర్వము సంపూర్ణము.





# మహాభక్తవిజయము.

## అనుబంధములు.

(ఇందు గ్రంథకర్తచే రచియింపఁబడిన పాటలుకాక, శ్రీయుత కొప్పరపు సుబ్బారావుగారిచే రచింపఁబడినవానికి * గుర్తు వేయఁబడియున్నది.)

(అనుబంధసంఖ్య లేదు.)

(సామాజికు లందఱును కలసి పాడునది)

* ప్రార్థన — ద్విపదతాళం.

శ్రీ నీలనీరద ఘనశ్యామా ॥శ్రీ॥
లలితకళాసార్వభౌమా ॥శ్రీ॥
పతితహరణ । మునివినుతచరణ
శుభంకరణ । దయాగుణభరణ
శ్రీ సరస్వతీ నాట్యమండలీభరణా మృదుచరణా
బృందావనవిహారణ । భువనపాల । గోపీలోల । మోహనబాల ॥శ్రీ॥

## 1. గజేంద్రమోక్షము.

(1) పరిజనులు - భూప్ రాగం - ద్విపదతాళం.

శ్రీవర । శుభకర । హరి । మురహర ॥శ్రీ॥
పాతకభయహర । వర । గిరిధర ॥శ్రీ॥
మోహనదాస జనావన । సాహసవితరణ । గుణఘన ॥శ్రీ॥
సకల । నిగమ । వినుత । విమలచరితా । సదమలనిరతా
బుధార్తిహర । భుజగశయనవరదా । కరివరభయహర ॥శ్రీ॥

(2) నారద గరుత్మంతులు (సుమరనకరేమనా మట్టు.)
సకల జగదావనా-ఆ-ఆ- ॥స॥
అకలంకా। జగదీశా। ప్రకటిత గుణాన్వితా ॥సక॥
ప్రభుఁడవీవె జగ। ద్బంధుఁడవీవే। విభవాతీతుఁడవీవే ॥సక॥

(3) నారద గరుత్మంతులు - హిండోల్ రాగం - ఆదితాళం.
లలిత లవంగలతా పరిశీలన। కోమలమలయ సమీరే॥ ల॥
మధుకర। నికరక। రంబిత। కోకిల। కూజితకుంజకుటీరే॥ ల॥
రాశీరహిరిహా। సరసవసంతే। నృత్యతి యువతిజనేన సమంసఖి।
విరహి జనాస్యదురంతే॥ లలి॥

(4) లక్ష్మి, విష్ణు, - డైలాగ్.
ఖరహరప్రియరాగం - ఆదితాళం.

లక్ష్మి— నను చతురంగమాడి జయింపఁగల
ధీమతులు। లేరనుచు। దలచితి॥ నను॥
నిపుణతఁ। కపటివై। గెలువఁగా
గలుగుటె ప్రతాపముని। యెంచదగదు॥ న॥
విష్ణు— కపటమింతయున నలిపియుంటినా
కనులఁగాంచి యిట్లనంగఁ దగునా
లక్ష్మి— కపటమెట్లు నలుపంగలవిఁకఁ
నిపుణమతిని నిను గెలిచెదఁగా
రయమునను। జయముగన దలఁపుమా
సమర్థతను। గాంచెదను। గాయిఁకను॥ నను॥

(5) గజేంద్రుఁడు - హిండోల్ రాగం.
లోకేశా। నీవే శరణ్యమురా॥ లో॥
ఆశ్రితభయ నాశకా॥ లో॥
(చరణము)
మహాభీకరం। బైన యవస్థం। బడివగతుఁ
సహాయంబుగానక। సరోవరమునం దిటులో
మురారిహరి వగతుగదా। కరుణజూడుమా॥ లో॥

(6) విష్ణువు - (నీలభరణమైతో అను మట్టు)

పాహిభయమువిడు । మోసపోదీనుడా॥ పా॥
వెతను గనకుమా - ఆ - ఆ - ఆ - ఆ - పా॥
అభయము నొసఁగెద నార్తగజేంద్రా
పాపిమకరమును । వ । ధిం । చె । దన్ ॥ పాహి॥

* (7) నారదుఁడు — భూప్ రాగం - ఆదితాళం,

నరనారాయణ । నటనాలీలా।ఎఱుఁగుదుననువా౽। డెంతటి బేలా॥నర॥
వరమానీశ్వర । వరులకునైనా। పరమ గూఢము।గదాయీ వేళా॥నర॥
పరులకువశుఁడా । పగిదిని చాలా। భ్రమజనియింపఁగ । జేయునుగా।
పరులకు లోనై । పరులను లోఁగొను । పరమార్థము తెలియఁగా
నెచాలా ॥నర॥

(8) దేవతలు, దేవతాంగనలు, నారద గరుత్మంతులు

(రయమునన్ మన కుటీరమునకున్ - అనుమట్టు)

బ్యాగ్ రాగం - ఆదితాళం.

కదలుఁడీ హరిపదంబు నరయన్ । ముదముగదురన్ రయంబునన్ ॥క॥
వదలఁడాయె రమానుబంధమున్। పాణిధరింపఁడు గాళరభరమున్॥క॥
పిలువడేరన । ప్రియపరిచరులన్ । కలవరపడునెద। నదెచనియెదుగా ।
కారణమేదియో। ఆరయుగా మది । కానఁగరాడు రమా మనోహరుని
సన్నిధి నుండగ జనుటహితంబౌ ॥క॥

(9) అందఱు - యమన్ - ఆదితాళం.

పాహివరదమాం । పాహికృపాళో ॥పా॥
మోహదమన సుర । మునినుతచరణా ॥పా॥
దాసజనావన । దానవహరణా ।
వాసవసన్నుత । వారిజనయనా ॥పాహి॥

గజేంద్రమోక్షము - సమాప్తము.

# 2. పరీక్షిత్తు.

10. పరీక్షిత్తు — (పూలబావికంతుమైకా అనుమట్టు.)
ఈవిదాహమేవిధానఁ । శమింపఁగలదో । ఈవనంబాదుఁ ॥ఈ॥
అవిరళదేహాయాసముగలిగెఁ । ప్రవిమలజల మేదారిగఁగొందుఁ
॥ఈ॥

11. శృంగి — కామవర్ధనిరాగం — ఆదితాళం.
తల్లిదండ్రులభజనమే ప్రియ । తనయుల కీలోకమందువిధియౌ ॥త॥
తెల్లవారగనె దీవనల్ వడసి । దినదినమును పూజలుగావింపఁ
కొల్లలుగ కందమూలములను వడి । ఘనంబుగఁగూర్చి । మనంగవలెగా
॥త॥
అనుదినమును నిత్యాగ్నిహోత్రముల । ఘనతరమగు ప్రీతినిసవరింపఁ
వినయమునచరణతీర్థము శిరమున । ప్రియమారగ ధరియింపవలయుగా
॥త॥

(12) శృంగి — హిందోల్ రాగం — ఆదితాళం.
ఇదేమి భయంకరసర్పమా ॥ఇదే॥
మదాభీలమై । మదిభయమొదవెడు ॥ఇ॥
కదలి నాజనకు । కంఠభాగమున
నిదివ్రేలుచు ను । న్నదిభీకరమై
కదలింపఁగనా । కడలుజనించెడు
గద ! యీవిపత్తుఁ । గాచువారెవరో ॥ఇ॥

(13) [పరీ]క్షిత్తు — కల్యాణి — రూపకం.
ఏలోకోయీముని శ్రేష్ఠులు । ఏగుదెంచిరిట కయ్యయో ॥ఏ॥
చాలగనాశ్రమవృకాళి । సంహరింపబిలువగనో ॥ఏ॥
పాలకుఁడనునే బ్రాహ్మణ । భక్తిని మఱచితినో
కాళలు సాధులనేచఁగ । గోరియూరకుంటినో
శీలముభక్తియుగల ముని । శేఖరులను దుర్దానవ
పాళిబాధ సేయుచుండ । పరాకుపడితినోయకట ॥ఏ॥

(14) పరీక్షిత్తు - జిల్లా - త్రిశ్రగతి.

(టీక) ఎంతటీ । యుపచా । రమూ । ఘటియిల్లెగా ॥ఎం॥
సుంతయూ । సువిచారముఁ । సలుపనైతిగా ॥ఎం॥
(గతి) అంతటి మునినాథునెడల । నపచారము జేసి తుదకు
చింతిలు చుంటిని గతజల । సేతు బంధనము రీతిగ ॥ఎం॥

(15) తక్షకుఁడు - బ్యాండు - త్రితాల్.

భళిభళినా । భయదఫణా । నలమున జగములు । కళవళమందవె ॥భ॥
చలమున జీవుల బరిమార్పం । జాలుదుగాపత్రి । లేనటుగా ॥భ॥
ప్రళయకాలాంత । కునివిధమున నే ప్రజ్వరిల్లి యాపాండవపౌత్రుని ।
నలయించెద। నొంచెద సమయించెద । నరసురకిన్నర ఖేచరు లదరగ॥భ॥

(16) తక్షకుఁడు - సురటరాగం - ఆదితాళం.

భళిరా నీదు మదినిపరిశీలన చేయక ।
ప్రాభవంబు గోరితివిగదా । చాలుచాలు ॥భళి॥
కలుగునే చూడు భూభరణమహాభరంబు ।
నిలుపుకొన లేక । దేవ్రురింపవలెనుగాక ॥భ॥
మనల కీ రాజ్యభార । మెందైన గలదా ।
ధనముదొరకు జతనంబు సేయనొగా ।
ఘనతర శ్రీసాధనంబు సంగ్రహింపగా ।
కామితార్థముం బడయుచు ధన్యత్వమందు ॥భళి॥

(17) కోలాహలుఁడు - తిలాంగ్ - ఆదితాళం.

(లవవిలా లాగ అనుమట్లు)

ఫలము చేకూరె । పరిపరివిధముల ॥ఫల॥
అలయక సొలయక । అహితము సలుపా
చెలిమిని వెలయఁగ । శ్రీశిలాసముగ ।
భుజగ భువన మణి । వ్రజము లభింపా ।
తక్షకుమైత్రి బరీక్షితుఁ గెడఁప ।
ఈక్షణమే ఘటియింతు కార్యమును ॥ఫల॥

(18) పరీక్షిత్తు - జయంతశ్రీరాగం - ఆదితాళం.

కరుణాకరా । యో శ్రీవరా ॥కరు॥

పరమాత్మ నిన్నే । నమ్మియుంటి నాత్మ

దరిజేర్చరారా । దానవాంతకా ॥కరు॥

ఎల్లవారివేడ । నొల్లనయ్య జేడ

నల్లనయ్య నిన్నే । నమ్మియున్నవాఁడ

తల్లిదండ్రివీవే । దారిలేదువేరే

తల్లడిల్లువాఁడ । దాసునేలుపోఁడ ॥కరు॥

(19) తక్షక కోలాహలులు.

(మెరి గాగరమె గుంగురు లగాదేన అనుమట్లు.)

భువిజనులను సంతతము । సంతోషమందజేయు నీధనంబె కా।

ఈధనంబెకా । కార్య । సాధనంబెకా ॥భు॥

ఈధనముగన ఘనమోదంబా

ఈధనమున నిండియుండు దైవంబే

లోకపతి జేయునుగాదే దరివ్యంబే

ఈధనమును గూర్చెడువాడె దేవుండో

వహవ్వా । భళారే । పరమానందం । బోహోహోయేమందుఁగా

ముదంబుగూర్చు నీధనంబెకా । కార్యసాధనంబెకా ॥భువి॥

(20) జనమేజయుఁడు (జాగోజిజరాజకుమారమట్లు)

నామానస మేలకలిగె ॥నా॥

చింత మేరమీరే । హా ॥నా॥

వరధీరోదారమూర్తి । నాదుతండ్రి నాఁడాహా

నాగేశుఁ చేతనీల్గె । గాయని వినగానే హా ॥నా॥

(21) నారదుఁడు — (అవినాశహా మట్లు)

దుర్గారాగం — ఆదితాళం.

అవినాశకా । ఆత్మారమణా । శుభచరణా

కరుణా । భరణా । సగుణా ॥అవి॥

భువనాధిశా। రా। దయజూడరా। ధీరా
వేణుగానలోలా। సకలామూర్తినమూనా ॥అవి॥

(22) తక్షకుఁడు - మాయామాళవగౌళ - రూపకము.

ధన్యుడైతినే। ధన్యుడైతినే॥ ధ॥
అన్యాలోచన లేటికి। పాతుని బరీక్షితుని జేసి॥ ధ॥
ఘనముని శాపాలాఘము। లను భూతంబగు విధాన
కమలగర్భ వాసితా। హితజనులకా విఘాతా
మనమున గనుగొని బాంధవ। జనులకు। దెలియుని। విధ
మున॥ ధ॥

పరీక్షిత్తు సమాప్తము.

---

## 3. కుచేలోపాఖ్యానము.

(23) కుచేలుఁడు - (ఏకిలా అను మట్టు)
భూప్ రాగం - ఆదితాళం.

హేపరిభూ। మదిలోనఁ। కరుణరాదా। నాదా॥ హే॥
జగదీశ్వరనీ। సఖునాపదలఁ। విడజేయువుగా। విమలాదరణా॥ హే॥
సతమగు మోహార్తతకొఱకై నీ। చరణంబుల మదినమ్మితిగా
వినుగను కోరికమీరగ వనముల। దిరిగెదదీనావనశ్రీనాయక॥ హే॥

* (24) కుచేలుఁడు - భూపాలరాగం - ఆదితాళం.

పాహీం ముకుందకృష్ణ॥ పా॥
పాహీం మురారికృష్ణ॥ పా॥
పాహీం అనంతరూపా
పాహీం మనోజరూపా॥ పా॥
పాహీం కృపాలవాలా
పాహీం యశోదబాలా॥ పా॥

* (25) కుచేలుఁడు— భూపాల - ఆది.

గోకులానందకంద । బృందానాథా । సుందరాకార సుధీర ॥గో॥
లోకైక మోహనబాలా । పాపౌవరగుణజాలా
నాపాపములనుమఱచి । కాపాడుమయ్య మాగోపాల ॥గో॥

(26) జయవిజయులు - మోహన - ఆదితాళం.

దయసేయవయ్యాకుచేలా । లీలా ॥దయ॥
నయచరితుఁడవు । ప్రియభక్తుఁడవు
భయరహితా నీ । భాగ్యమునిండెను ॥దయ॥

(27) అష్టభార్యలు - సారంగరాగం - త్రిపదతాళం.

యదువంశచంద్ర । సద్గుణసాంద్ర । అలఅలఅలఅల । తారహార
యోగోపికాజార । బృందావనసంచార ॥యదు॥
అసురగణవిఫాలా । లో । కావనాసుశీలా
మునిహృదయుని । లోల । వనమాలా । గుణజాలా ॥యదు॥

(28) కుచేలుఁడు (వందనకిరి తుర్ఘులా అనుమట్లు)

వందన ముకులకళా । గోపాలా ॥వంద॥
శ్రీనామా । కతితాశ్రిమా ॥వంద॥
దాసావనఃను । ధ్యానరతుఁడనై
భక్తిగొల్తు సుఖ । దాయకా ॥వంద॥

(29) కుచేలుఁడు - జిల్లాకాఫీ - ఆదితాళం.

యదుకుల మోహనబాలా । వసుచేలా ।
శుభ శీలా । గుణజాలా ॥య॥
సదముల ఫాలా । జగపతి హేలా ।
త్రిభువన పాలా । దైత్యవిఫాలా ।
శుభగుణలోలా । విభవవిశాలా ।
మోహన మురళీలోలా । నందబాలా ।
వనమాలా । గుణశీలా ॥య॥

(30) కృష్ణుఁడు - (ఫడకాలీ పేరిమాధ్వజావలె)
హితమణీ భక్తాగ్రిణీ ॥హిత॥
హితుడవన । క్షితిని నీవే ॥హిత॥
ఘనమా । నానందమో । సుఖమో మదిని నిండగా।
నినుగనుట । జన్మసాఫలతా । పదయుగళా।
నోహరా । భక్తాగ్రిణీ ॥హిత॥
కుచేలోపాఖ్యానము సంపూర్ణము.

---

# 4. మార్కండేయ.

(31) పీరుసాహెబు - బ్యాగ్ రాగం - త్రితాల్.
ప్యారీ । వహ్వారీ । మిలీహై । ఫరీజాగ ।
మేరీ । నసీబ్ సే జావుంగా । ఫరిస్థాగ ॥ప్యా॥
వారే వారే యీమారూ । రంబాహకాతది । మాజోరూ।
ప్యారీకూ।దూరూకూ।మిాళాయిస్తాం।మిాళాయిస్తాం।మజాసేస్తా॥ప్యా॥

(32) రంభ (బోలిక్యామెరి అనుమట్టు)
చాలుపో । ముది । సరసము తెలిసెను ।
శీలహీనత । జెలగెదు సోమయాజి ॥చా॥
ముసలివాఁడ । వయినవీడ । వయితివి ।
ముదితగనిన మదిదెలియని సరసము ।
కుదురుగ ననియతి । కుటిలపు విరసము ॥చాలు॥

(33) పీర్ సాహెబ్ - బ్యాగ్ రాగం - త్రితాల్.
ఆమక్ సెగులాం । హై । పాంకిసలాం । బోడెమ్మగారికీసేస్తాం ॥ఆ॥
భేమక్ సే షాదీసేస్తాం । లోలక్ లుతెచ్చి తగిలిస్తాం
మేరెతన మన ధన సబు । దయచేస్తాం ॥ఆ॥
ఏక్ దఫాముద్దు లిప్పిస్తాం । పాగసుపారీలు తీగపిస్తాం
అధి కోపంసేస్తే । పాం పకడ్తాం ॥ఆ॥

(34) అందఱు - డైలాగ్ - బ్యాగ్ రాగం - ఆదితాళం.

అందఱు— హాహా దైవమా । రవ్వంతలోన । సౌఖ్యము హత
మారెన ॥హా॥

సోమ— అమర వేశ్యకై యాశవహించీ
యజ్ఞయాగములకై శ్రీనుగాంచీ
యమలోకము జేరితిమి మించీ
ఆశాభంగము గాంచితి నేటికి ॥హాహా॥

దీక్షి— బావగారితో పాటుగ యజ్ఞము
గావించితి రంభా సుఖమునకై
ఈవిధివంచన యగునంచెఱుఁగక
పోవలసెను రవరవ కూపములకు ॥హాహా॥

పీరు— మాకీరంభా మోహంసేశీ
షోకంసాబ్బీ ఖిలాయీ
భోగంవోర్కీ నమ్మకూడదని
బుద్ధిదెచ్చుకున్నాను భాయీ ॥హాహా॥

భటుఁడు— నడునడువుడు పాపాత్ములారా
చెడిపోయెను మీ యాశాబంధము
విడివడి పోగ రెక్కలన గిత్తలవలె
చెడు వేశ్యా భోగము గోరితిరా॥

అందఱు— హాహా దైవమా॥

(35) నారదుఁడు - (రాధేకృష్ణబోలె అను మట్టు)

రాధేకృష్ణ । దీనభరణా॥ రా॥
రాధేకృష్ణ శ్రీవినోదా । శ్రీగదాయుధా
నాథా శ్రీగదాయుధా॥ రా॥
హతపాతక నుతగుణా । పతితావనా । విమలచరణా
త్రిభువనాతీత । మురహరణా
ఘనమురళీ దివ్యనాదా । శ్రీగదాయుధా
కృష్ణా । శ్రీగదాయుధా॥ రా॥

(40) మార్కండేయుఁడు.

అసావేరి - త్రితాల్.

రారాఫణిహారా। శివశంకర ॥రారా॥
ఘోరమైన సం।సారజలధిలో
దరి గనజేయుము। కరుణాభరణా ॥రా॥
కలుషచరిత్రుఁడ। కరుణాపాత్రుఁడ
భక్తినెఱుంగని। బాలుఁడనయ్యా
ఫాలవిలోచన భవబంధమోచన
ఏలుకొనుము నను। హిమగిరిజాధవ ॥రా॥

(41) మార్కండేయుఁడు - హిందోల్ రాగం - కురుజంపెతాళం.

కంఠాభరణశేష। కైలాసనగివాస ॥కం॥
కమలభవ। వినుతపద। నగసుతాహృదయేశ ॥కం॥
సుగభీర సువిచార। నగధీర ఫణిహార
బాలశశిధరమారి। శంకర హర నమోస్తు ॥కం॥

(42) అందఱు - బ్యాండు స్వరం - (దాదా)

శివశంకర విశ్వంభర గంగాధరా ॥శివ॥
హే మారహరా। త్రిపురహరా। హే। పాపవిదూర
విగతదురిత శశిధరా ॥శివ॥

మార్కండేయ సంపూర్ణము.

---

# 5. ధ్రువచరిత్ర

(43) సురుచి - శ్రీరాగం - రూపకతాళం.

ఈగుణములవలననేకా। ఇటులగల్గుటా। వనట ॥ఈ॥
శ్రీగుణాన్వితుఁడు। సింహాసనార్హుఁడు। సన్మానపాత్రుఁడు నాపుత్రుఁడూ
భాగధేయుఁడుత్తముఁడు। సుందరుఁడు! పక్షపాతమేలనీకు ॥ఈ॥

(44) సురుచి - సురటరాగం - రూపకతాళం.

తొలఁగుతొలఁగుబాలకా । పలుమరుపూరాడకా ॥తొ॥
కలవావిని దలపోయక । గడుసుఁదనముగాఁ బలుకక ॥తొ॥
అలయక నావిభునిదక్షి । ణాంకమున వసించుభాగ్య
మలవడెరా యోపలువా । పలువాదము లేలరా? ॥తొల॥

* (45) ధ్రువుఁడు - పూరికల్యాణి - ఆదితాళం.

జరుగదు నీపో । షణము లేనిదే । క్షణమేనియు నీజగతి రమేశా ॥జరు॥
అరుగదు । తరుగదు । అరవీసమేని । నిరతమునీయా । నతిలేనియెడల ॥జరు॥

ఆదిమధ్యాంతరహితుఁడవై । అఖిలలోకజీవకర్తవై అనంతనామక ధారివై । అఘవిదారివై । అనవరతముభక్తుల యార్తిహరించెదు । ఆనంద దాయివై । నిరపాయివై । సుఖదాయివై । వెలింగెదవు । నిరుపమ నిష్కామ నిష్కళంక సచ్చిదానందస్వరూప । కలుషవిదూర । గంభీర ఖలసంహారా । ఘనహారా । దురితవిదూర । నగధీరా ॥జరు॥

(46) నారదుఁడు - (సాధోమనకా మట్టు.)

దాసాభరణా । భక్తిశీలా ॥దాసా॥
కామక్రోధ సంతతులన్ విడుమా । ప్రేమాకరశుభనామా ॥దా॥
భవభయమాయా । పతనముమాయా । భవునిగొల్వ శుభగేయా
భక్తిపాశబంధమే బలంబై । పశుపతిగెల్చు సుశీలా ॥దా॥
అస్తుతినిందా । సాంకృతులెల్లన్ । ప్రస్థానములై పోవన్
నరపాలక హరినామభజనమే । పరమార్థముభువిలోనా ॥దాసా॥

* (47) ధ్రువుఁడు - జయంతశ్రీ - ఆదితాళం

శ్యామసుందరకుమారా ॥శ్యామ॥
కామకోటివదనా ॥శ్యా॥
సుగుణసదన సుకుమారా
నందకులాభరణా ॥శ్యా॥

—• దశావతార - త్రయోదశ రాగమాలిక •—

(48) ధ్రువుఁడు - హిందోల్ - రూపకం.

లేఁడులేఁడు । కావరాఁడు । జగదీశుఁడు । సర్వేశుఁడు ॥లేఁడు॥

(49) మోహన - రూపకం.

సకలచరాచరవిభుండు । ప్రకటితరవికోటినిభుఁడు
అకలంకుఁడు జగన్మోహ । నాకారుఁడు నిర్వికారుఁడు

(50) కల్యాణి - రూపకం.

తొలివేలుపుఁజదువులగొని । తోయధిమధ్యమునకుఁజని
చోరుఁడైనసోమకునియు । సురులుగొనిన కల్యాణి

(51) భాగేశ్వరి - రూపకం.

అమృతోత్పాదనమునకయి । అమరులు నసురులును దరువ
అబ్ధిమున్గుమందరంబు । నెత్తిన భాగ్యేశ్వరుండు

(52) భైరవి - రూపకం.

భైరవవరహావతార । ధారియగుచు కనకాక్షుని
పోరునవధియించినట్టి । భూతలోకాధినాథుఁడు

(53) నాయిక - రూపకం.

చటులభ్రుకుటి యగుచుభయద । ఘటితభీమరూపి యగుచు
నరహరిరూపమునఁబొడమి । నట్టిజగన్నాయకుండు

(54) లలితరాగం - రూపకం.

విప్రబాలకాకృతితో । వితరణగుణశాలియనఁగ
బలిని రసాతలముఁజేర్చి । వరలలితాకారుఁడౌ హరి

(55) తోడిరాగం - రూపకం.

భూసురులను బాలింపఁగ । భూపతులను దూలింపఁగ
కార్తవీర్యునతనితోడి । ఘనులనెల్లదునిమినహరి ॥ లే॥

(56) భూపాలరాగం - రూపకం.

జనకుని యానతిగొని వన । మున, మునిజనములనుబ్రోచి
రావణముఖదైత్యకోటి । దూల్చు రాము భూపాలుఁడు

(57) కామవర్ధని - రూపకం.

కోమలమురళీనినాద । సామగాన రతులచేత
గోపికామనఃప్రమోద । కామవర్ధనుండగుహరి

(58) విమలరాగం - (జయంత శ్రీ) రూపకం.

విమలశాంతరూపంబున । వికటాశాతాపంబున
సుమహితమగు సత్త్వతత్త్వము । సూచించిన బుద్ధమూర్తి.

(59) కేదారగౌళ - రూపకం.

కలిచేపాపముమీరిన । కాలంబునఖలులగూల్చి
కులధర్మములను నిలిపిన । కరుణాకేదారమూర్తి

(60) కన్నడరాగం - రూపకం.

కన్నడసేయుఁగనేలా । సన్నుతమునినుతశీలా
గరుడవాహనాప్రమేయ । కనకాంబర కలుషదూర

హిండోల్ - రూపకం.

కలఁడుకలఁడు కావఁ గలఁడు । జగదీశుఁడు సర్వేశుఁడు ॥క॥

(61) మంగళహారతి - బ్యాండుస్వరం - రూపకం.

మందరధర । మంగళకర మంగళంబురా ॥మం॥
మారసుందరా । శ్రీరమేశ ప్రోవరా
దాసభరణ దోషహరణ । దానవేశనాశా॥
రాజరా । జేశ్వరా యోపరాత్పరా
శ్రీని । వాసజగ । దీశా
శ్రీరమా । నాయకా । జగన్నాయకా ॥మం॥

సంపూర్ణము.



# కాలకేతనము.

(గ్రంథకర్త—సోమరాజు రామానుజరావుగారు)

కథానాయకుఁడగు కాలకేతనుఁడు మహాభయంకర స్వరూపుఁడై—నిరంతర హత్యాదాహముచే, ప్రకృతిభీకరుఁడై—యొనరించిన హత్యలసంఖ్యాకములు. కాలకేతనునివంటి భయంకరవ్యక్తి మన ఆంధ్రనాటకములలో నింతకుమున్ను చిత్రింపఁబడి యుండలేదు. ప్రథమముననే యుఱిదీసిన రూపలి యాత్మశక్తి మహాపిశాచమై—కాలకేతనుని తుదవఱకును వెంటాడినది. రాజశ్యాలకుఁడగు నీలకంఠుఁడు రాజ్యకాంక్షాతురుఁడై—రాజనాశనసంకల్ప మహాయజ్ఞమున కంకురార్పణము చేసినాఁడు. చోరశిఖామణియు, జూదరియు నగు మృగేశుఁ డా యజ్ఞమునకు ఉపద్రష్టగా నిలువఁబడినాఁడు. చిన్న భార్యయగుమంగళ దుర్బోధనలు చెవికెక్కి—కాలకేతనుఁడు—మహాసాధ్వియగు పెద్దభార్యను సులోచనను ఘోరముగ హత్యచేసినాఁడు. భీషణమైన యారాత్రి—కాలకేతనజీవితమునం దొక మహాకాళరాత్రి; ఆరాత్రియే సులోచనా వధాంతరమున విశ్వాసపాత్రభృత్యుఁడగు అగభాషి కాలకేతనుని భీకరకరవాలాగ్రమున నేలఁగూలినాఁడు. ఆరాత్రియే తండ్రియగు కాలకేతనుడు శాంతికేతనుని గ్రుడ్డితీసినాఁడు! పాపము పండినది! ప్రకృతికాంత కాలకేతనుంజూచి వికృతహాసము గావించినది! దిశలుదద్దరిల్లినవి! మంగళా నీలకంఠ మృగేశుల ద్రోహములు రత్నహారమూలమున బయల్పడినవి! కాలకేతనము—మృత్యుసూచకమై అంబరస్థలమున సంచలించుచున్నది. సర్వజన నాశన మొనరించి కాలకేతనుఁడు పశ్చాత్తాపశోకముచే ఆత్మహత్య చేసికొన్నాఁడు. చదువఁదగిన భయానకనాటకము!

వెల రు. 1—0—0.

